# విజయలక్ష్మి పండిట్

## జీవిత చరిత్ర

రచయిత :

పురాణం కుమారరాఘవశాస్త్రి. B. A.,

ది మోడరన్ న్యూస్ ఏజన్సీ,
బుక్‌సెల్లర్సు & పబ్లిషర్సు,
గవర్నరుపేట, బెజవాడ.

# పరిచయం

భారతదేశమునకు స్వాతంత్ర్యం భారతీయమహిళల చేతనే సాధింపబడుతుంది — అని విశ్వవిఖ్యాత సాముద్రికశాస్త్ర వేత్త 'షీరో' తాను రచించిన 'ప్రపంచ భవిష్యత్తు' అనే గ్రంథంలో పేర్కొన్నాడు. ఎన్ని సంవత్సరాల నుంచో సాగుతున్న మన స్వాతంత్ర్యసమరచరిత్రను పరిశీలిస్తే ఆ పలుకులు అయథార్థం కావని విశదమవుతుంది.

మొన్న మొన్నటి ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో— అమరయశస్సు నార్జించిన అజాదుహింద్ సైనికులను తయారుచేసి, భారతీయుల దాస్యశృంఖలాలను సాయుధ బలంతో విచ్ఛేదింప ప్రయత్నించి, బర్మానుంచి బ్రిటిషు ప్రభుత్వంమీద దండెత్తి, మనదురదృష్టవశాత్తూ విఫలుడైన నేతాజీ సుభాష్ చంద్రబోసు బర్మాలో ఒకానొక చోట ప్రసంగిస్తూ—1857 వ సంవత్సరంలో జరిగిన సైనిక విప్లవమే మన మొదటి స్వాతంత్ర్యసమరం....ఆనాడు మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి ప్రారంభించిన స్వాతంత్ర్య సమరాన్నే మనం ఈనాడు కొనసాగిస్తున్నాం. ఆ అబల స్వయంగా కత్తిపట్టి రణరంగాన కురికి, భారతీయుల దౌర్భాగ్య వశమున ఓడిపోయి వీరశయ్య నలంకరించింది. కాని ఈనాడు మనం విజయాన్ని చేకొనటానికి అలాంటి సాహసోపేతలైన ఝాన్సీరాణీలు ఎన్నో వేలమంది ముందుకు రావలసిన అవసరమెంతైనా ఉన్నదని ఉద్బోధించాడు. ఆ ఉద్బోధన వ్యర్థంకాలేదు. రణోత్సాహంతో ఎంతోమంది

స్త్రీలు మరణాన్నైనా లక్ష్య పెట్టక సైన్యంలో చేరటానికి సంసిద్ధత కనపరిచారు! 'ఝాన్సీ రాణీ దళం' అనే పేరుతో స్త్రీ సైనిక దళం ఏర్పడింది. అబలలైన స్త్రీలు కేవలం స్వాతంత్ర్యాభిలాషిణులు మాత్రమే కాక సంగ్రామ యోధినులైనారు.

ఆదళానికి ఆధిపత్యాన్ని వహించిన కేప్టెన్ లక్ష్మి 1945 సంవత్సరం మార్చిమాసాంతనమున 'మమ్యో'(Mamyo)లో బ్రిటిష్ వారికి యుద్ధ ఖైదీగా చిక్కింది కాని, 'జితాఽస్మి' అని తలవాల్చలేదు. ఒక బ్రిటిష్ కమాండురు — 'నేను యుద్ధభూమిలో ఎదురు పడినట్లైతే ఏమి చేసే దానివ'ని ఆమెను ప్రశ్నింపగా, నిర్భయంగా, 'కాల్చిచంపివేసే దాన్ని' అని సమాధాన మిచ్చినదా వీరనారీమణి.

ఇలాంటి ధైర్య సాహసాలుకల స్త్రీలు మన దేశంలో అనాదినుంచీ ఉద్భవిస్తూనే ఉన్నారని, మన దేశ చరిత్ర క్షుణ్ణంగా చదివిన వారికి తెలియనిది కాదు. కేవలం ప్రాచీన కాలంనాటి వీరాంగనలను స్మరించుకుని కాని, సకృత్తుగా ఈనాడైనా ఏ ఒకరిద్దరో ఉన్నారని కాని మనం తృప్తి చెంద నవసరం లేదు. మహాత్మా గాంధీ ప్రారంభించిన ప్రతి సత్యాగ్రహోద్యమంలోనూ వేలకొలది భారతీయ వనితలు తమకుతామై సమధికోత్సాహంతో చేరి, కారాగార క్లేశాల కాహుతి అయినారంటే—వారిలో ఉన్న ఆరని ఆ స్వాతంత్ర్యపిపాస, ఆ ఉద్రేకం తాత్కాలికమైనవి కావు.

అజాద్ హింద్ ఫౌజుకు చెందిన ఝాన్సీరాణీ దళంలో చేరిన వీరాంగనలకు, అసహాయోద్యమంలో జేరి జైళ్లలో

ప్రగ్గిన అబలలకు ఆచరణలో ఆవంత విభేదమున్నా — వీరందరి హృదయాల్లోనూ ఉన్న స్వాతంత్ర్యతృష్ణ, విప్లవ శక్తి సమానం కాదని అనలేము.

అది ఈనాటిది కాదు. ఇంచుమించు తొంభై సంవత్స రాల క్రితం తొలిభారత వీరాంగన ఝాన్సీరాణి తాను విఫలురాలై మరణించినా, దేశమంతటా ఆమె వెదజల్లిన విప్లవ బీజాలే ఇన్నాళ్లూ నిగూఢంగా అభివృద్ధిపొంది ఈనాడు ఫలోన్ముఖము లౌతున్నాయనటం అత్యుక్తికాదు.

భారతదేశంలోని స్త్రీ 'అబల' అన్నది కేవలం అపప్రథ. బాల్య వివాహాలు ప్రారంభమయిన మధ్యకాలంనుంచి వచ్చిన అపప్రథేకాని ఇది; చరిత్ర ప్రారంభమైననాటి నుంచీ ఉన్న సత్యం కాదిది.

వేదకాలంనాటి స్త్రీలకు అబలత్వంకాని, భోగదాస్యం కాని మచ్చునకైనా ఉండేవికావు. సాంఘికంగా, రాజ కీయంగా పురుషులతోపాటు సమాన గౌరవ ప్రాతినిధ్యాలు సంతరించుకో గలిగారు.

విదేశీయుల దండయాత్రలు, దోపిళ్లు ప్రారంభమయి, మతం పేరిట అంతఃకలహాలు, అసహనత్వం ఏర్పడిన రోజుల్లో బైటకు వస్తే స్త్రీలు శీలరక్షణ చేసుకోవటం కష్టమై ఇల్లు దాటి రావటానికి వీలులేని విషమ పరిస్థితి ఏర్పడింది. ఈనాడు నౌఖాలీ దురంతాలలో స్త్రీలపై జరిగిన అత్యా చారాలు ఎంతటివో ఆనాడు స్త్రీలు బైటికి వచ్చినా అలాగే జరుగుతూ ఉండేవి.

ఆ నాటినుంచే ప్రారంభమైంది మనదేశానికి దుర్దశ....

వీధిమొహం కరువయ్యే సరికి స్త్రీకి విద్యా సంస్కారాలు కూడా దూరమైనాయి. వంట ఇంటి కుందేళ్లయినారు వనితలు. తర్వాత ఏర్పడిన జమీందారీయుగం వారిని కేవలం పురుషులకు భోగవస్తువులుగా చేసింది. దాంతో స్త్రీ స్థితి మరీ అధ్వాన్నమైంది. అంతకు పూర్వం రసపుత్ర వీరాంగనలు చూపిన ధైర్య సాహసాలు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖితములు కాలేదూ?....

కాలచక్రం మార్పు చెందుతోంది. ప్రపంచ మంతటా సర్వతో ముఖంగా విజ్ఞానం అభివృద్ధి చెందుతోంది. పర దేశాలలో స్త్రీలకు మన దేశంలోని స్త్రీల కన్న విశిష్ట స్థానం ఏర్పడింది. భారతీయ మహిళలలోని 'పరదా' పద్ధతి వైదొలగటంతోపాటు, బాల్య వివాహాలు కూడా అంతరించాయి. ఇప్పుడిప్పుడే మళ్లా స్త్రీలల్లో విద్యా సంస్కారాలు ప్రారంభమవటంతో-భావదాస్యం కూడా క్రమంగా సన్నగిల్లుతోంది. వైదికయుగంలో స్త్రీలకున్న విశిష్టస్థానం—మళ్ళీ ఈనాటి స్త్రీలు ఆక్రమించటానికి ఇంకెంతో కాలం పట్టదు. 'షీరో' చెప్పిన భవిష్యత్ఫలితాలు, అక్షరాలా సత్యమని రుజువు కాబోతున్నది.

1885 సంవత్సరంలో ఉద్భవించిన అఖిలభారత కాంగ్రెసు ప్రభావంవల్ల, దేశంకోసం ఎన్నో త్యాగాలుచేసి, దేశసేవే తమజీవితానికి ప్రధానలక్ష్యంగా భావించి, దేశస్వాతంత్ర్యం కోసం అహర్నిశాలూ పాటుపడుతున్న మహిళామతల్లు లెందరో ఉన్నారీనాడు.

అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గ సభ్యురాలుగా ఎన్నో

సార్లనుంచి పనిచేస్తూ, 1925 లో జరిగిన కాంగ్రెసు మహా సభ కధ్యక్షస్థానాన్ని అలంకరించి, స్త్రీలలో స్వాతంత్ర దీక్షను రగుల్కొల్పి,— 1930 లో లండనులో జరిగిన 'రౌండుటేబిల్ కాన్ఫరెన్సు'కు భారతమహిళా ప్రతినిధిగా వెళ్ళి వచ్చి, తన జీవితమంతా భారతస్వాతంత్ర్య సముపార్జనకై ధారవోస్తున్న విదుషీమణి శ్రీమతి ముత్యాల సరోజినీనాయుడు. ఆయమ అకుంఠిత కార్యదీక్ష భారతీయ వనితలకందరకూ ఆదర్శప్రాయం.

ఇండియాలో ప్రప్రథమంగా మంత్రిపదవి నలంకరించిన మహిళామణి విజయలక్ష్మీపండిట్. ఆమె మంత్రిణిగా ఉండి స్వధర్మాన్ని నెరవేర్చుకొనుట మాత్రమే కాక, ప్రపంచ రాజకీయపరిజ్ఞానాన్ని బాగుగా నలవరచుకుని, ఎన్నోసార్లు విదేశాల కేగి, విదేశీయులకు భారతీయులన్న సుహృద్భావాన్ని కలిగించింది. అమెరికాలో బ్రిటీషు ప్రభుత్వం-భారతీయుల ధనాన్ని లక్షలకొలది వెచ్చించి భారతదేశం మీద కావించిన దుష్ప్రచారాన్ని సమయింపజేసింది. శాన్‌ఫ్రాన్సిస్‌కోలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభకు హాజరై, ప్రపంచ శాంతిని గురించి నిర్ణయించుటకు ఈ అగ్రరాజ్య త్రయానికి గల అర్హత ఏమిటో వివరించమని సవాల్ చేసిన ధీమణి. జాతీయ కేంద్ర ప్రభుత్వం ఏర్పడిన అనంతరం తొలుదొల్త ఇండియా ప్రతినిధిగా అమెరికా వెళ్లి ఆమె కావించిన కృషికి అక్కడివారు ఇండియాలో ఇంతటి రాజకీయ విద్యావిశారదులు లున్నారా అని ఆశ్చర్యపడ్డారు. మన దేశీయులచేతనే కాక విదేశీయుల మన్ననలకు కూడా

బడసిన ప్రతిభాశాలిని విజయలక్ష్మి పండిట్.

1942 క్విట్ ఇండియా ఉద్యమంతో భారత రాజకీయ రంగంలో తళుక్కున మెరిసి, రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యంలో ప్రభుత్వానికి పట్టుబడకుండా మూడున్నర సంవత్సరాలు అజ్ఞాతవాసం కావించి ప్రభుత్వానికి కళ్లు కప్పి, జంకూ గొంకూ లేకుండా తాను చేయవలసిన విధిని అజ్ఞాతంగానే ఉండి సక్రమంగా నిర్వర్తించిన విప్లవాంగన అరుణ ఆసఫాలీ.

ఇలాంటి స్త్రీలికెందరో ఉన్నారు. ఈముగ్గురిదృక్పథంలో మాత్రం కొంచెం విభిన్నత్వం ఉంది. అయినా కాంగ్రెసు ఆదేశాన్ని అందరూ అంగీకరించేవారే.

గాంధీజీ అహింసా విధానంలో అచంచలమైన విశ్వాసం సరోజినీదేవికి. కాంగ్రెసు ఆదేశాన్ని యథాతథంగా నిర్వర్తించటంలో ఆమెకు కడుంగడు విశ్వాసం.

విజయలక్ష్మిదికూడా కాంగ్రెసు దృక్పథమే అయినా ఆమెలో సోషలిజంవాసన అంతో ఇంతో లేకపోలేదు. ఆమె ఏసమస్యను ఆలోచించినా, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులతో మేళవించి సునిశ్చయానికి రాగలసత్తా ఆమెది. కాంగ్రెసు దృక్పథాన్ని సోషలిజం దృక్పథాన్నీ సమన్వయ పరచి స్వాతంత్ర్య పంథాను ఏర్పరచుకోవాలని ఆశయం.

ఈ ఇద్దరి దృక్పథాలకు విభిన్నమైన దృక్పథం అరుణ ఆసఫాలీది. గాంధీజీ నాయకత్వంలో ఆమెకు ఎంతేని విశ్వాసం ఉంది. కాని సోషలిస్టు దృక్పథంలో విప్లవం వస్తేనేకాని ఇండియాకు స్వాతంత్ర్యప్రాప్తి కలుగదని ఆమె విశ్వాసం....

వీరి దేశసేవాతత్పరత, త్యాగదీక్షల మూలంగా అఖిల భారత మహిళాలోకంలో నూతన జాగృతి నూతన చైతన్యం వెల్లివిరుస్తోంది. ఈజాగృతికీ, ఈ చైతన్యానికీ మనం ఎంతైనా గర్వించవలసి ఉన్నది.

ఏ దేశపు నాగరికతను నిర్ణయించాలన్నా, ఆ దేశంలో స్త్రీలకు రాజకీయంగా, సాంఘికంగా ఉన్న ఔన్నత్యాన్ని బట్టి నిర్ణయించవలసి ఉంటుంది అని ఒక ఫ్రెంచి తత్త్వవేత్త ఉద్ఘాటించాడు.

ఏ దేశంలో నయినా మహామహులు బయలుదేరటమనేది, పుట్టినప్పటినుంచీ, స్త్రీలుకాని పురుషులుకాని, పెరిగే వాతావరణాన్నిబట్టి కూడా ఉంటుంది. జన్మతః వచ్చే సంస్కారం మాత్రమే కాకుండా, నిగూఢంగాఉండే ప్రతిభాసామర్థ్యాలు బైటపడటానికి తగినంత దోహదంకూడా ఉండాలి.

విశ్వవిఖ్యాతి గాంచిన మేడమ్‌క్యూరీ (ఫ్రెంచి సైంటిస్టు) మరొక గొప్ప సైంటిస్టును వివాహ మాడటంవల్లనే అంతర్జాతీయంగా అంతఖ్యాతిని సంపాదించేంత గొప్ప సైంటిస్టు కాగలిగిన దని ప్రతీతి — అర్థాత్తూ స్త్రీ వివాహం వల్ల తన ఆదర్శాలను, ఆశయాలనూ వదులుకో నవసరం లేదు. స్త్రీలు తాము అభ్యసింప దలచిన విద్యను పూర్తి చేసుకుని, తమ ఆశయాలకు అనువైన పురుషుణ్ణి వివాహ మాడవలెనని శ్రీమాన్ రాజగోపాలాచారి కూడా ఒక ప్రసంగంలో పేర్కొన్నాడు. అలా సమానమైన ఉత్కృష్టాశయాలతో సక్రమంగా గార్హస్థ్యాన్ని నిర్వహించిన దంపతులకు సత్సంతానం కలుగక తప్పదు.

మన దేశంలో ఇంచుమించు సగం జనాభాగల. స్త్రీలను ఊరికే వంటఇళ్లల్లో కూర్చోపెట్టి, రాజకీయంగా గాని, సాంఘికంగా గాని, వైజ్ఞానికంగా గాని వారిలో అంతర్లీనంగా ఉన్న శక్తులకు తగిన ప్రోత్సాహం దోహదం ఇవ్వనిదే, పురుషులతోపాటు సమాన ప్రతిపత్తి స్త్రీలకుకూడా కలిగించనిదే మన దేశానికి అభివృద్ధి అనేది ఉండదు అని విజయలక్ష్మి సోదరుడు జవహరులాల్ నెహ్రూ పేర్కొన్నాడొకసారి....

ప్రకృతం — ఇండియాలోనే కాక అంతర్జాతీయంగా ఇంతటి ఖ్యాతిని ఆర్జించిన విజయలక్ష్మి జీవితం తెలుసుకోవటం స్త్రీలకుమాత్రమేకాక పురుషులకుకూడా ఎంతేని అవసరం.

## జననం – బాల్యం

వస్తుతః నెహ్రూ వంశీయులు కాశ్మీరదేశస్థులు. సౌందర్యానికీ, ప్రకృతిసౌందర్యానికీ, విలాసవస్తువులకూ ప్రసిద్ధికెక్కిన దేశమేకాక, కాశ్మీరం ఈనాటికీ విలాసప్రియులకు విహారప్రదేశం. అంతేకాకుండా అనాదినుంచీ మహాకవులకూ – మహా విద్వాంసులకుకూడా ఉనికిపట్టు. పూర్వం 1716 లో కాశ్మీరంనుంచి ఢిల్లీవచ్చి స్థిరనివాస మేర్పరచుకున్న నెహ్రూ వంశీయుల మూలపురుషుడు రాజాకౌలు

సంస్కృత పారశీకభాషల్లో మహా విద్వాంసుడు. ఔరంగ జీబు అనంతరం ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించిన ఫరుక్‌షీరు చక్రవర్తి కాశ్మీరం విహారానికి వెళ్ళినప్పుడు ఈ రాజా కౌలు విద్వత్తును తెలుసుకుని, తన ఆస్థానపండితునిగా పిలిపించుకుని, సబహుమానంగా ఆయనకొక జాగీరునిచ్చి ఢిల్లీలో ఒక బంగాళాకట్టించి ఇచ్చాడు. ఆ బంగళా ఒకకాలువ ఒడ్డున ఉండేది నహరూ— అన్నశబ్దానికి కాలువ అని అర్థం. నహరూయే నెహ్రూ. కౌలునెహ్రూ అనేది నెహ్రూవంశజు లకు కుటుంబ నామధేయం. కాని క్రమంగా కౌలు అన్నది పోయి, నెహ్రూ శబ్దం మాత్రమే కుటుంబ నామధేయంగా మిగిలిపోయింది....

మొగలుల సామ్రాజ్యం అస్తమించి, ఈస్టిండియా కంపెనీవారికి అధికారం హస్తగతమైన రోజుల్లో కూడా, నెహ్రూవంశీయులు అధికారికంగా ఉన్నతపదవులనే ఆక్ర మించారు. విజయలక్ష్మీ తాతగారైన గంగాధరనెహ్రూ 1857 విప్లవానికి పూర్వం ఢిల్లీలో కొత్వాలుగా ఉండేడి వాడు. కాని ఆ విప్లవ సంధర్భంలో వీరు తమఆస్తి పాస్తుల నన్నీ వదలుకొని ఆగ్రాకువచ్చి స్థిరపడి పోయారు. ఆ సంద ర్భంలో ఒకచిన్న తమాషా జరిగింది. అప్పటికింకా మోతీ లాల్ నెహ్రూ—విజయలక్ష్మి తండ్రి—జన్మించలేదు. వీరంతా వస్తూ వుండగా విజయలక్ష్మి మేనత్తను చూసి మిలిటరీ వాళ్లు ఆమె ఆంగ్లవనిత అనీ, వీరెక్కడికో రహస్యంగా ఎత్తుకొని పోతున్నారని భ్రమపడి, వెళ్లనీయకుండా ఆపుచేశారు. కాని మెల్లిగావాళ్లకు ఇంగ్లీషులో అసలుస్థితి తెలియచేసి వచ్చేశారు.

గంగాధరనెహ్రూ చాల చిన్నవయస్సులో ఆయనకు 34 వ ఏట చనిపోయాడు. తండ్రి చనిపోయిన మూడు మాసాలకు మోతీలాలునెహ్రూ 1861వ సంవత్సరం మే 6వ తేదీన ఆగ్రాలో జన్మించాడు. విశ్వకవి రవీంద్రనాథఠాకూర్ కూడా సరిగా ఆరోజునే బెంగాల్‌లో ఉద్భవించాడు. ఒకేరోజున జన్మించిన ఈ మహానుభావులిద్దరూ మన దేశానికి భిన్నదృక్ప థాల్లో మహోపకారం చేసినవారే....

విజయలక్ష్మికి ఇద్దరు పెత్తండ్రులుండేవారు. వారిలో పెద్ద వాడైన బన్సీధర్ నెహ్రూ గవర్నమెంటు ఉద్యోగం చేస్తూ ఉండేవాడు. రెండవ పెత్తండ్రి నందలాల్ నెహ్రూ రాజపుటా నాలో ఒక ఎస్టేటుకు పది సంవత్సరాలు దివానుగా ఉండి, తర్వాత లా చదివి ఆగ్రాలో ప్రాక్టీసు పెట్టాడు.

విజయలక్ష్మి తండ్రి మోతీలాల్ నెహ్రూ పన్నెండేళ్ల వయస్సు వచ్చేవరకు అరబ్బీ—పారశీ భాషలను నేర్చుకొని, తర్వాత కాన్పూరు గవర్నమెంటు హైస్కూల్లోచేరి, ఎం ట్రన్సు పరీక్షలో మొదటితరగతిలో ఉత్తీర్ణుడై, అలహాబాదు కాలేజీలో చేరాడు. అప్పట్లో ఆయన సహాధ్యాయులలో పండిత మదనమోహనమాలవ్యా మహనీయు డొకడు.

మోతీలాలు బి. ఏ. తప్పటంతో కాలేజీచదువుకు స్వస్తి చెప్పి, ప్లీడరు పరీక్షకు చదివి ప్యాసై, కాన్పూరులో మూడు సంవత్సరాలు ప్రాక్టీసుచేసి తర్వాత అలహాబాదు హైకోర్టుకు ప్రాక్టీసు మార్చుకొన్నాడు. ఆయన ఆతరువాత మళ్లీ బి. ఎ. ప్యాసు కానే లేదు. అలహాబాదు హైకోర్టులో సముత్తీర్ణుడైన లాయరుగా ఆయన బంగారుపతకాన్ని బహుమతిగా పొంద

కలిగాడు. అంతకు పూర్వమే అలహాబాదులో కొత్తగా హైకోర్టు స్థాపించడంతో మోతీలాల్ నెహ్రూ సోదరుడు నందలాల్ నెహ్రూ ఆగ్రానుంచి కుటుంబాన్ని అలహాబాదుకు మార్చాడు. అనాటినుంచి ఈనాటివరకూ నెహ్రూకుటుంబం వారికి అలహాబాదే స్థిరనివాసం.

మోతీలాలుకు మొదట్నుంచీ పాశ్చాత్య వ్యామోహం హెచ్చుగా ఉండేది. ఇంగ్లీషువారినీ, వారి పద్ధతులనూ, వారి సంప్రదాయాలనూ, విజ్ఞానాన్నీ ఎంతో మెచ్చుకొనే వాడు. ఇండియాలో ఇంగ్లీషువారి అధికారం నిలవటానికి వారి స్వప్రతిభా సామర్థ్యాలే కారణాలని విశ్వసించేవాడు. 1885 వ సంవత్సరంలో ఇండియన్ నేషనల్ కాంగ్రెసు ఆవిర్భవించింది. ప్రభుత్వాన్ని అర్థించడం, తమ కోరికలను వారికి నివేదించుకుని వారి ఆదరానుగ్రహాలని పొందటమే ఆనాటి కాంగ్రెసు ఆశయం. ఇంగ్లీషు చదువుకున్న మధ్య తరగతి ప్రజలను ఆరోజుల్లో కాంగ్రెసు ఎక్కువగానే ఆకర్షించేది. మోతీలాల్ కూడా అప్పట్లో అప్పుడప్పుడు ఆమహా సభలకు హాజరయినా, ఆకార్యకలాపాల్లో అంతగా శ్రద్ధ వహించలేదు.

కాంగ్రెసు జన్మించిన నాలుగు సంవత్సరాలకు 1889 సంవత్సరం నవంబరు 14 వ తేదీన జన్మించాడు— విజయలక్ష్మి సోదరుడు జవహర్‌లాల్ నెహ్రూ. తర్వాత పదకొండు సంవత్సరాలకు 1900 సంవత్సరం ఆగస్టు 18 వ తేదీన స్వరూప్ కుమారి నెహ్రూ (విజయలక్ష్మి పండిట్) పుట్టింది.

ఈమె పుట్టినప్పుడు మోతీలాల్ పండితుడు •యూరప్ సంచారంలో ఉన్నాడు. జవహరుకు పదకొండేళ్ళ వయస్సు. అప్పటివరకు తనకు చెల్లెళ్లుకాని, తమ్ముళ్లుకాని లేనందున అతడికి కొంచెం నిరుత్సాహంగా ఉండేది. ఇన్నాళ్లకు తనకు చెల్లెలో తమ్ముడో పుట్టబోతున్నారనే ఉత్సాహంతో వరండాలో పచారు చేస్తున్నాడు. ఒక డాక్టరు వచ్చి, తమ్ముడు కాదు చెల్లెలే అని చిరునవ్వుతో ధ్వని యుక్తంగా చెప్పాడు. అంటే తమ్ముడయితే ఆస్తిలో భాగం పంచుకుంటాడు—చెల్లెలే కనుక అలాంటి ఇబ్బంది ఏమీలేదు—అని వారి •తాత్పర్యం.... కాని ఆమాట పరిహాసంగాఅన్నా ఆ లేత వయస్సులో జవహరు మనస్సుకు ఎంతో బాధ కలిగించింది. పుట్టగానే ఆస్తి పంపకం అన్నప్రశ్న ఎంతటి అల్పబుద్ధులకైనా ఉంటుందో ఉండదో!

విజయ లక్ష్మిని చిన్నప్పుడంతా స్వరూప కుమారి అని పిలిచేవారు. తల్లిపేరు స్వరూపరాణి నెహ్రూ.

అప్పుడు మోతీలాల్ లాయరు వృత్తిలో లక్షలకొద్దీ ఆర్జిస్తున్నాడు. ఈమె పుట్టటానికి •ఒక్క సంవత్సరం క్రితమే ఆనంద భవనాన్ని నిర్మించాడు. ఆ భవనంలోనే పుట్టింది స్వరూప్. ఆ భవనం ఎంతో అందంగా ఆధునిక నాగరికతా జీవితానికి అనువైన సదుపాయాలతో నిర్మింప బడింది. భవనం వెనుక బ్రహ్మాండమైన తోట, ఒకవైపున టెన్నిసు కోర్టు, వేసవి భవనం, చుట్టూ చిన్న చిన్న ఇళ్లూ (Out Houses) ఈతలాడేందుకు కేళీసరస్సు—ఎన్నెన్నో ఉండేవి. విశాలమైన గదులు. వరాండాలు. ఆ సరస్సులో ఒకసారి

స్రప్రూ ఈతరాక మెట్లమీద కూర్చుని జారిపడ్డాడట. అప్పు డాయన జూనియర్ లాయరుగా ఉండేవాడు.

ఇంకా ఐశ్వర్యాని కనుగుణంగా దాసదాసీలు, నౌకర్లు కార్లు, గుర్రాలూ, కుక్కలూ, గుర్రపు బగ్గీలూ — ఇలాంటివి ఎన్నో.... ఎంతో హోదాగా వెళ్ళబుచ్చేవాడు జీవితాన్ని. ఆరోజుల్లో ఐశ్వర్యమోహితులు సాధారణంగా ఘనతకోసమని విలువైన విస్కీలు, వైనులు త్రాగుతూ ఉండేవారు. అలాంటిదేదో ఎర్రని పానీయం స్నేహితులతో కలిసి మోతీలాల్ ఒకరోజున త్రాగుతూంటే చూసి పసిబాలుడైన జవహరు తల్లిదగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళి 'నాన్న రక్తం త్రాగుతున్నా' డని చెప్పాడుట!....

అలాంటి శ్రీమంతుని ఇంట జన్మించిన బాలిక స్వరూప కుమారి....

ఇంట్లో పిల్లల్ని పెంచటానికి, విద్యాబుద్ధులు నేర్పటానికి, సంరక్షకురాండ్రగా ఆంగ్లేయ వనితల్నే ఏర్పాటుచేశాడు మోతీలాల్. జవహరు, స్వరూపకుమారి, ఆమెచెల్లెలు కృష్ణ అంతా పుటుకతోనే ఆంగ్లేయ సంపర్కాన్ని అలవరచుకున్నారు. ఉగ్గుబాలతోపాటు హూణవిద్యకూడా జీర్ణమైపోయింది వీరికి.

స్వరూపకుమారి చిన్నప్పుడు ప్రాథమిక పాఠశాలలకు పోయి చదువుకునేదికాదు. శ్రీమంతుల బిడ్డలను మామూలుగా పాఠశాలలకు పంపటం ఘరానాగా యెంచబడేది కాదానాడు. కావలిసిన ఉపాధ్యాయులుగాని, ఉపాధ్యాయినులుగాని ఇంటికివచ్చి చదువు చెప్పేడివారు. స్వరూప

కుమారికి చిన్నప్పుడు మిస్. హూపర్ అనే ఆంగ్లవనితను సంరక్షకురాలుగా నియమించాడు మోతీలాలు. ఆమె ఎంతో ఉన్నతకుటుంబంలో జన్మించిన యువతి అనీ ఎంతో యోగ్యురాలనీ ప్రతీతి. కృష్ణకు కూడా ఆమే సంరక్షకురాలుగా ఉండేది.

ఇలా చిన్నప్పటినుంచీ ఎలాంటి నిర్బంధాలూ లేకుండా స్వేచ్ఛా వాతావరణంలో పెరగటం అలవాటయింది స్వరూపకుమారికి. అయినా దైనందిన కృత్యాల్లో మాత్రం ప్రతిపనీ టైంప్రకారం చేసుకుని పోవాలనే నియమం ఉండేది.

ఉదయం లేవగానే స్వరూప్ అందమైన చిన్న తెల్ల గుర్రంమీద స్వారిచేస్తూ ఉండేది. స్వరూపకుమారే కాదు ఆ ఇంట్లో అందరికీ చిన్నప్పుడు ఇంచుమించు బాగా నడక అలవాటవటంతోపాటు గుర్రపుస్వారీకూడా అలవాటయ్యేది అని కృష్ణ వ్రాసింది. తర్వాత తోటలో కూర్చుని వేళ ప్రకారం చదువుకోవటం, భోజనం, తర్వాత విశ్రాంతి.... మధ్యాహ్నం పియానోమీద సంగీతాభ్యాసం, తర్వాత మళ్ళీ సాయం వాహ్యాళి. తర్వాత స్నేహితులతో సరదాగా ఆటలూ—పాటలూ....

ప్రొద్దుకూకింతర్వాత మాత్రం కాలక్షేపానికి ఆరోజుల్లో ఈనాటిలాగా సినిమాలంత హెచ్చుగా ఉండేవికావు. అదీ కాక అంత ఫ్యాషనూ కాదప్పుడు. కనుక సర్కస్ కాని సంగీతకచేరీలుకాని, అప్పుడప్పుడు వినోదాలుగా ఉండేవి.

మోతీలాలుకు ఎన్నడూ క్షణం తీరిక ఉండేది కాదు.

ఉదయం, సాయంత్రం మాత్రం కొంతసేపు పిల్లలతో సర దాగా కాలక్షేపంచేసేవాడు. ఆయన చిన్నతనంలో ఆడపిల్ల లనుకూడా ఇంత స్వేచ్ఛగా, గుర్రాలమీద స్వారీచేయిం చటం అవీచూస్తే కొంతమంది ఆయన మిత్రులకు కష్టంగా ఉండేది. అయినా ఆడపిల్లలను మగపిల్లలను పెంపకంలో ఆయనెలాంటి ప్రత్యేక నిర్బంధాలనూ పాటించలేదు.

స్వరూప కుమారిది సహజంగా మొదటినుంచీ సరళ హృదయం. సౌందర్యంతోపాటు వినయ విధేయతలు కూడా ఆమెకు అలవాటయ్యాయి. తన సంరక్షకురాలి ఆదేశాన్ని ఎన్నడూ సాధారణంగా అతిక్రమించేదికాదు. మిస్. హూపర్ ప్రాచీన పద్ధతుల కనుగుణంగా పిల్లల్ని కొంచెం నిర్బంధా లలో పెంచాలనే స్వభావం కలది. ఆ పద్ధతి, ఆమె అధికారం కృష్ణ కునచ్చేదికాదు. చిన్నప్పుడు అందరి వాత్సల్యాన్నీ చూర గొన్న బాలిక స్వరూప కుమారి ఎంతటి సరళ హృదయురాలైనా ధైర్యానికీ, ఆత్మబలానికి తక్కువ లేదామెకు. ఆ లక్షణాలను ఆమె తననాయనమ్మ దగ్గర్నుంచి నేర్చుకున్నదని ప్రతీతి.

మోతీలాల్ తల్లిలో కాశ్మీరదేశ స్త్రీల సహజమైన స్థైర్యధైర్యాలు మూర్తీభవించాయని, జవహరే పేర్కొన్నా డొకచోట.

స్వరూపకుమారికి ఏడవఏట 1907 సంవత్సరం నవంబ రులో చెల్లెలు కృష్ణహతీసింగ్ జన్మించింది. ఆమెతర్వాత మరోశిశువు జన్మించినది కాని, కొన్నిమాసాలకన్న ఆశిశువు ఎక్కువ జీవించలేదు.

# నెహ్రూ కుటుంబం-రాజకీయ వాతావరణం

1905 సంవత్సరం మేనెలలో జవహర్‌లాల్ నెహ్రూ ఉన్నత విద్యాభ్యాసానికై ఇంగ్లాండుకు ప్రయాణమయ్యాడు. అతడివెంట తండ్రి మోతీలాల్‌కూడా సకుటుంబముగా బయలుదేరి వెళ్ళాడు. స్వరూపకుమారికప్పు డించుమించు అయిదు సంవత్సరాల వయస్సు. మొట్టమొదటిసారిగా ఆమె విదేశగమనమదే. జవహరు హారో విశ్వవిద్యాలయంలో చేరగానే మోతీలాల్ భార్యా పుత్రికలతో ప్రపంచయాత్ర చేసి కొన్ని నెలలకు మరల ఇండియా తిరిగివచ్చాడు.

ఆ సంవత్సరం ఇండియాలో రాజకీయ సంచలనం చెలరేగింది. అప్పటివరకు అనగా కాంగ్రెసుపుట్టిన ఇరవై సంవత్సరాలవరకు కాంగ్రెసు పెద్దలు బ్రిటిషుప్రభుత్వానుగ్రహానికి పాత్రులౌతూనే వచ్చారు. ప్రభుత్వ నిరంకుశ విధానానికి అసమ్మతి కనబరచినా ఆందోళన బయలుదేర తీసెడివారు కాదు. జాతీయభావం, స్వపరిపాలన అనేవి వారి హృదయాల్లో ఎక్కడో నిగూఢంగా ఉండేవి. అయినా కాంగ్రెసు వేదికలపై వారిఉపన్యాస ధోరణులు బ్రిటిషు ప్రభుత్వానికి అనుమానబీజాలు మొలకలెత్తించక పోలేదు. మున్ముందు భారతీయుల్లో ఈజాతీయ చైతన్యం విస్తరిల్లి విప్లవరూపం ధరిస్తుందేమోననే శంకకూడా ప్రభుత్వానికి కలిగింది.

అంచేత జాతీయభావ సమృద్ధికి, జాతీయగౌరవ ప్రతిష్ఠాపనకు ముందడుగు వేస్తున్న వంగదేశాన్ని రెండు ఖండాలుగా

విభజించి, ఒక ఖండంలో మహమ్మదీయులకు ప్రాబల్యాన్నీ, ప్రాముఖ్యాన్నీ సమకూర్చ వలెనని ఆనాటి రాజప్రతినిధి కర్జను ప్రభువు సంకల్పించాడు. తత్ఫలితంగా హిందువు లకు మహమ్మదీయులకు మధ్య ఆరని ద్వేషాగ్ని రగిల్చి జాతీయ సామరస్యాన్ని చెడగొట్టవచ్చునని ఆయన ఆశయం. ఆఆశయాలు అమోఘంగా ఫలించాయి అని ఈనాటి కైనా నౌఖాలీ దురంతాలు స్పష్టపరుస్తూనే ఉన్నాయి. ఆ విభజన 1905 సంవత్సరం అక్టోబరు 16వ తేదీన అమ్లు జరుపుటకు ముహూర్తం నిశ్చితమైనది.

తత్ఫలితంగా కేవలం వంగదేశంలోనే కాక యావద్భా రత దేశంలోనూ జాతీయోద్రేకం ప్రజ్వరిల్లింది. అరవింద యోగీంద్రుడా రోజుల్లో రాజకీయాల్లో ఎంతో శ్రద్ధగా కృషి చేసేవాడు. 1906 లో స్వదేశదీక్ష, విదేశవస్తు బహి ష్కరణము, జాతీయవిద్య, స్వరాజ్య సాధన అను సూత్రా లతో బహుముఖంగా తీవ్రమైనఉద్యమం ప్రారంభమయింది. ఈ 'స్వరాజ్య' మనేపదం—ఆసంవత్సరం కలకత్తాలో జరి గిన కాంగ్రెసు మహాసభ కధ్యక్షత వహించిన దాదాబాయి నౌరోజీ మహాశయుని ముఖతః వెలువడింది. ప్రప్రథమంగా 1908 సం॥ లో బిపినచంద్రపాల్ దేశమంతా తిరిగి జాతీయ భావాల్ని ప్రచారం చేశాడు. ఆసంవత్సరమే అలహాబాదులో కాంగ్రెసులోని మితవాద నాయకులంతా సమావేశమై, కాంగ్రెసుకు మితవాద కార్యక్రమానుగుణ్యంగా ఒక ప్రణా ళికను తయారుచేసి, అతివాదులచేతుల్లోకి కాంగ్రెసుని జారి పోనీకుండా హస్తగతం చేసుకున్నారు.

ఆ సంవత్సరం కాంగ్రెసు మహాసభ మద్రాసులో, అప్పటి గవర్నరు సర్ ఆర్థరు కాలీ అనుగ్రహంవల్ల ప్రాప్తమైన గుడారాలలో జరిగింది.. ఏమయినా ఈ తిరోగాములైన మితవాదులతో కలసి పనిచెయ్యనని తిలక్ మహాశయుడు శపథం పట్టాడు. అప్పటి లగాయతు 1915 సంవత్సరంలో బొంబాయిలో జరిగిన కాంగ్రెసు వరకు మితవాద ధోరణే కాంగ్రెసుది. ప్రభుత్వానికి విజ్ఞప్తులందజేసుకోవటం, ప్రభుభక్తిని వెల్లడించటమే వారి ప్రధాన కార్యక్రమం. అంచేత అతివాద ప్రముఖుడైన తిలక్ మహాశయునిమీద ప్రభుత్వం రాజకీయనేరం మోపి, ఆరుసంవత్సరాలు శిక్ష విధించి 1908 లో మాండలే జైలుకు పంపింది.

ఈ మితవాద ధోరణి సాగినంతకాలం మోతీలాలు రాజకీయాల్లో అంతగా శ్రద్ధవహించలేదు. ఆ సంవత్సరంలో (1915) ప్రారంభమైన హోంరూలు ఉద్యమంలో మోతీలాలుకు ఆసక్తి ఏర్పడింది. అంతవరకు దివ్యజ్ఞాన సమాజంలోనే కాలం గడుపుతున్న ఆనీబిసెంటు హఠాత్తుగా రాజకీయాల్లో ప్రవేశించింది. 1914 సంవత్సరాంతమునే తిలకు విడుదలైనాడు. అప్పటికి దక్షిణాఫ్రికా సత్యాగ్రహి గాంధీజీ ఇండియాలో అడుగు పెట్టాడు. జవహరులాల్ బారిష్టరుపట్టా పుచ్చుకుని ఇండియాకు తిరిగివచ్చి అప్పటికి ప్రాక్టీసు ప్రారంభించాడు. మోతీలాలుకు రాజకీయాల్లో ఆసక్తి ఏర్పడిం దగ్గర్నుంచీ ఆనందభవనానికి రాజకీయ వేత్తల రాకపోకలు జాస్తి అయినాయి. విజయలక్ష్మికి చిన్న

తనంలోనే • కాంగ్రెసు నాయకు లెందరితోనో పరిచ·
యాలు ఏర్పడ్డాయి.

ఆ సంవత్సరం బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహా
సభలతోపాటు ఆ వారంలోనే ముస్లింలీగు సభలు కూడా
జరిగాయి. కాంగ్రెసు నాయకులు కూడా చాలామంది లీగు
సభలకు హాజరైనారు. ఆ సభల కన్నింటికీ మోతీలాల్‌తో
పాటు పదిహేను సంవత్సరాల వయస్సులో ఉన్న విజయ
లక్ష్మికూడా హాజరయింది. కాని, ఆనాటి రాజకీయ ధోరణు
లను ఆమె పూర్తిగా అవగాహన చేసుకోలేకపోయింది.
కేవలం కాంగ్రెసు సూత్రాలు మాత్రమే అర్థమయ్యేవి
కాని, వాటిని విమర్శనాబుద్ధితో యోచించేలంత పాటవం
కలగలేదామెకు.

1916 సంవత్సరంలో ఢిల్లీలో జవహరులాల్ •వివాహం
మహావైభవంగా జరిగింది. ఆ వివాహానికి సన్నాహాలు నెలల
తరబడి చేశారు వివాహానికి ఒకవారం ముందే పెళ్ళివారు
అలహాబాదునుంచి ఢిల్లీకి ప్రత్యేకపు రైల్లో ప్రయాణమై
నారు. దేశంలో అన్నివైపులనుంచీ వచ్చిన అతిథులకూ,
బంధువులుకూ ఏర్పాటుచేసిన బసలు చాలక ప్రత్యేకం
గుడారాలను నిర్మించవలసి వచ్చింది.

రోజుల తరబడి జరిగిన అక్కడివేడుకలు పూర్తికాగానే
జవహరులాల్ నెహ్రూ భార్య కమలతో తన మాతృభూమి
యైన కాశ్మీరానికి విహారం వెళ్లాడు. విజయలక్ష్మి
ప్రభృతులు, మరి కొంతమంది బంధువర్గముకూడా వెళ్లారు.
కాశ్మీరంలోని ప్రకృతి దృశ్యాలను, పర్వతలోయలను,

మంచు శిఖరాలనీ దర్శించి ఆనందిస్తూ, కులాసాగా కొన్నాళ్లు కాలక్షేపంచేసి వచ్చారు.

అప్పటికి ప్రథమ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. యుద్ధపురోజుల్లో సహజంగా సంప్రాప్తమయ్యే ఒడుదుడుకులకు, నెహ్రూ కుటుంబంలో మాత్రం అంతగా పరివర్తన కలగలేదు. విజయలక్ష్మి తల్లి ఆరోజుల్లో తరచుగా క్లబ్బుకు వెడుతూ ఉండటం మాత్రం జరిగేది. జవహరులాలూ, మోతీలాలూ మాత్రం యుద్ధవార్తలనుగూర్చి చర్చించు కుంటూ ఉంటే —విజయలక్ష్మి వింటూఉండేది.

1917 సంవత్సరంలో ప్రభుత్వాధికారులు జరిపిన యుద్ధ పరిషత్తుకు గాంధీజీ హాజరై, తిలక్‌నుకూడా హాజరు కావల సిందిగా కోరాడు. కాని తిలకు సుతరామూ అందు కిష్టపడ లేదు. గాంధిజీ—యుద్ధంలో బ్రిటిష్‌వారికి సహాయం చేయ వలసిందేనని సమర్థిస్తూ స్వయంగా ఎంతోమందిని సైనికు లుగా చేర్పించాడు.

ఆసంవత్సరమే నెహ్రూ కుటుంబంలో ఒకసంఘటన జరిగింది. విజయలక్ష్మికి, కృష్ణకి —అక్కచెల్లెళ్ల కిద్దరికీ— అంతవరకు సంరక్షకురాలుగాఉన్న మిస్ హూపర్ వివాహం చేసుకుని వెళ్ళిపోయింది. పదిహేడేళ్ళ వయస్సులోకూడా విజయలక్ష్మికి ఆమె సంరక్షకత్వం వహించింది. ఆమె వెళ్ళి పోవటం ఈ సోదరీ ద్వయాని కెంతో విచారం కలిగించింది. మిస్ హూపర్ వెళ్ళింది లగాయతు, పది సంవత్సరాల వయస్సులో ఉన్న కృష్ణకు విజయలక్ష్మి సంరక్షకత్వం వహించి, మాతృదేవతలాగా ఆమెయెడ ఎంతో వాత్స

ల్యాతిశయాలు కనబర్చేది. మధురమైన ఎన్నో సాయంతన సమయాలు—తోటల్లో కావ్యగీతికల పఠనంతో కులాసాగా గడిచిపోయేవి. కవిత్వమంటే అక్కచెల్లెళ్ల కిద్దరికీ అపరిమిత మైన ఆసక్తి. విజయలక్ష్మి చదివి చెబుతూంటే కృష్ణ వింటూ ఉండేది. కృష్ణకు చిన్నతనంలో విజయలక్ష్మి ఆదర్శ మూర్తిలా ఉండేది.

ఆతర్వాత కృష్ణ కొన్నాళ్లు స్కూలుకు వెళ్లి చదువవలసి వచ్చింది. అది మోతీలాలుకు ఏమాత్రం ఇష్టం లేకపోయినా చివరకు అంగీకరించక తప్పిందికాదు. సాధారణంగా శ్రీమం తుల బిడ్డలు, ఆంగ్లేయులూ మాత్రం చదివే యూరపియన్ స్కూల్లో ప్రవేశించింది. కాని విజయలక్ష్మి జీవితంలో ఎన్నడూ స్కూలుకు వెళ్ళి చదివి ఎరుగదు. అలా వెళ్ళి చదువు కోవాలనే ఆసక్తికూడా ఆమె కుండేదికాదు.

ఆమెకు పదిహేను సంవత్సరాల వయస్సులో నృత్యం నేర్చుకోవాలనే ఆసక్తి హెచ్చుగా ఉండేది. అందుకు ప్రయ త్నించింది. కాని ఎంచేతో, తల్లి తండ్రులు ఆమె అభిలా షను మొదట్లోనే త్రుంచివేశారు.

1918 సంవత్సరం నవంబరులో యుద్ధం ముగిసింది. కాని యుద్ధకాలంలో తాత్కాలికంగా అమలు జరుపబడిన శాస నాలను శాశ్వతంగా ఉండేట్లు చేయాలని ప్రభుత్వం ఒక కమిటీని నియమించి చిత్తు ప్రణాళికలనుకూడా తయారు చేయించింది. ఆ ప్రణాళికల పుణ్యమా అని గాంధిమహాత్ముడు కార్యరంగంలో ప్రవేశించాడు.

1919 సంవత్సరం కాంగ్రెసు మహాసభ పంజాబులో జరుపవలెనని నిశ్చయమైంది. కాని అందుకు ప్రభుత్వం అంగీకరించ లేదు. సభా సంచాలకులైన డాక్టరు సత్యపాల్, డాక్టరు కిచ్లూలను మేజిస్ట్రేటు మర్యాదగా ఇంటికి పిలిపించి తెలియకుండా ఎక్కడికో పంపించి వేశాడు. ఈ అకృత్యానికి ఆవేశపూరితమైన ప్రజానీకం, మేజస్ట్రేటు ఇంటివైపుకు పరుగెత్తుతుంటే మిలిటరీదళం కాల్పులు జరిపింది. ఆ తర్వాతనే ఇండియా రాజకీయాల్లో తీవ్రమైన మార్పు తెచ్చిన మరపుంచి సంఘటన — జలియన్‌వాలాబాగ్ కాల్పులు జరిగింది. దానితో బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాలో ఇంకా తమకు అంతో ఇంతో మిగిలిన ప్రతిష్ఠను బూడిద పాలు చేసుకుంది. మన స్వాతంత్ర్యకాంక్ష సర్వతో ముఖంగా ప్రజ్వరిల్లింది. ఆ సంఘటనే మోతీలాలును సంపూర్ణంగా రాజకీయ రంగానికి తీసుకుని వచ్చింది.

గాంధీ మహాత్ముడు అప్పుడు అలహాబాదు వచ్చి, ఆనంద భవనంలో మకాం చేసి, రాజకీయ పరిస్థితులన్నీ మోతీలాలుతో సమగ్రంగా చర్చించాడు. ఆ సంవత్సరం అనుకున్న ప్రకారం పంజాబు అమృతసరులో జరిగిన కాంగ్రెసు మహాసభకు మోతీలాల్ నెహ్రూయే అధ్యక్ష స్థానాన్ని అలకరించాడు.

అప్పటికి జవహరులాల్ రాజకీయాల్లో తీవ్రవాద శ్రేణిలో పనిచేస్తూ ఉండటం తండ్రికి ఇష్టంగా ఉండేదికాదు. నిత్యమూ తండ్రి కొడుకులకు వాదోపవాదములు — ఒక్కొక్కప్పుడు తీవ్రంగా కూడా జరుగుతూ ఉండేవి. వాటి ఫలితంగా ఆనంద భవనంలో తాత్కాలికంగా కొంత అశాంతి ఏర్పడింది.

విజయలక్ష్మి వాటినన్నిటినీ గమనిస్తూ ఆకళింపు చేసుకుంటూ ఉండేది. ఈ దుడుకు పిండం జవహారు ఎప్పుడు జైల్లో పడ తాడో అనిభయం మోతీలాలుకు. రాజభోగాల్లో పెరిగిన సుకుమారుడు తన ఏకైకపుత్రుడు జవహారు జైలుకేగితే ఆ కష్టాలని సహించలేడని ఆ పితృహృదయం ఆవేదన చెందింది. జైల్లో కటిక నేలమీద పరుంటే ఎలా ఉంటుందో అనుభవపూర్వకంగా తెలుసుకోవటానికి, మోతీలాలు అప్పు డప్పుడు ఆనంద భవనంలో ఒట్టి నేలను పరుండే వాడట !

ఈ జలియన్‌వాలాబాగు సంఘటనతో నెహ్రూ కుటుం బమంతా రాజకీయాల్లో సంపూర్ణంగా ప్రవేశించింది. రాజకీ యాల్లో అహోరాత్రాలూ పనిచేయటానికి మోతీలాల్ పండి తుడు తన లాయరు వృత్తిని పరిత్యజించాడు. లక్షలాదిగా ఆర్జిస్తూ, వైభవంగా ఖర్చు పెడుతూ సుఖజీవితానికి ఆధార మైన వృత్తిని వదిలి వెయ్యటంతో ఆర్థికంగా కొంత బాధపడ వలసి వచ్చింది. వీలైనంతవరకు ఖర్చును తగ్గించటానికి ప్రయత్నించాడు. మోతీలాలు ముందు కోచిబళ్లను, గుర్రా లను అమ్మివేశాడు. ఒకళ్లిద్దరు నౌకర్లను మినహాయించి మిగతావారినందర్నీ తీసివేశాడు. విలువయిన వస్తువులను కూడా కొన్నిటిని అమ్మివేశాడు. నిరాడంబర జీవితాన్ని కొనసాగించాడు. పుట్టినప్పటినుంచీ అలవాటులేని ఈనిరా డంబర జీవితానికి కుటుంబంలో అందరు మొదట్లో అలవాటు పడటానికి కొంత కష్టమయినా తర్వాత వారినేమంత బాధించలేదు.

1920 సంవత్సరంలో గాంధీజీ సత్యాగ్రహ

ప్రారంభించవలెనని ప్రయత్నించాడు. సరీగ్గా. ప్రారంభించ తలచిన రోజు ఆగస్టు 1 వ తేదీని తిలకుమహాశయుడు బొంబాయిలో అస్తమించాడు. సరీగ్గా ఆఉదయానికే సింధు పర్యటనం ముగించుకుని మహాత్ముడు బొంబాయి వచ్చాడు. వెంట జవహర్‌లాలు కూడా ఉన్నాడు. ఆతిలక్ మహనీయుని అంత్యక్రియలలో వీరిద్దరూ పాల్గొన్నారు. ఆ మహనీయుని అస్తమయంతో కాంగ్రెసు భారమంతా గాంధీజీ వహించ వలసి వచ్చింది.

మహాత్ముడు ప్రారంభించిన అసహాయోద్యమంలో, మోతీలాలు, జవహరులాలు ఇద్దరూ ప్రవేశించారు. అప్పటికి తండ్రికొడుకు లిద్దరూ రాజకీయాల్లో ఒకే దృక్పథానికి చేరు కున్నారు. మొదట్లో ఆ ఉద్యమంపట్ల మోతీలాలుకు అంత సుముఖత్వ ముండేదికాదు. వారి వెంట మోతీలాల్ సతీమణి స్వరూపరాణి, జవహరు భార్య కమలా నెహ్రూ, సోదరి విజయ లక్ష్మి అంతా ఆ ఉద్యమానికి చేయూత నిచ్చారు.

## వివాహం - విదేశయానం

విజయలక్ష్మి రంజిత్ పండిట్‌ల వివాహం 1921 సంవ త్సరం మే 10 వ తేదీన జరిగింది.

రంజిత్ పండిట్ కథియవార్‌లోని బారిష్టరు. కేవలం బారిష్టరేకాకుండా విద్వద్వరేణ్యుడు. విజ్ఞానఖని. గాంధీజీ అంతరంగిక కార్యదర్శి, పూజ్యుడైన మహాదేవ దేశాయి — ఈరంజిత్ పండిట్‌లు కాలేజీలో సహాధ్యాయులు. వీరిద్దరూ ఒకే సంవత్సరం బి. ఏ. పరీక్ష ప్యాసయినారు.

1920 . సంవత్సరంలో కలకత్తానుంచి శ్రీరామానంద ఛటర్జీ మహాశయుని సంపాదకత్వాన (ఇప్పుడు కేదారనాథ ఛటర్జీ) వెలువడే సుప్రసిద్ధ ఆంగ్లమాస పత్రికలో రంజిత్ పండిట్ 'గురుపదసన్నిధి' (At the feet of the Guru) అనే అమూల్య వ్యాసాన్ని రాశాడు.

మహాదేవదేశాయి అలహాబాదు వచ్చి, ఆనంద భవనంలో ఉన్నప్పుడు ప్రసంగవశాత్తూ, విజయలక్ష్మికి సహజంగా ఉన్న సాహిత్యాభిరుచిని గమనించి, ఆతని మిత్రుడు వ్రాసిన వ్యాసాన్ని చదవమని సలహా ఇచ్చాడు. ఆ వ్యాసం ఆమె నెంతో ఆకర్షించింది. ఆ వ్యాసకర్తలోని విద్వత్తు, ఆమె సాహిత్య తృష్ణను మరింత ప్రజ్వలింపచేసింది.

మహాదేవదేశాయి, ఆ వ్యాసకర్తను పరోక్షంగానే పరిచయంచేస్తూ అతడి పాండిత్య ప్రతిభను, గుణసంపదను కొనియాడాడు.

తర్వాత రంజిత్ పండిట్ విజయలక్ష్మిని కలుసుకొనుటకు వచ్చి, "నన్ను వివాహం చేసుకుంటావా?" అని నవ్వుతూ ప్రశ్నించాడు. 'నీకోసం ఎన్నో మైళ్లు, ఎన్నో నదులు, ఎన్నో అవాంతరాలను దాటి వచ్చాను. భవిష్యత్తులో జీవితంలో సంఘటించే ఇలాంటి అవాంతరాలను మనం ఇద్దర్మూ చేతులు చేతులూ కలుపుకుని కలసి దాటటానికి ప్రయత్నిద్దాం' అన్నాడు ఆ గీర్వాణభాషా కోవిదుడు.

అది వారి మొదటి పరిచయం. తర్వాత అప్పుడప్పుడు తరచు కలుసుకుంటూ ఉండేవారు. ఆయనలోని విజ్ఞానాన్ని ఆమెఎంతో ప్రశంసించేది. తర్వాత ఇద్దరికీ వివాహం జరి

గింది. అయితే నెహ్రూకుటుంబంపట్ల ఎంతో స్నేహవాత్స ల్యాలుకల మహాత్మాజీ అభిప్రాయాన్ని కూడా పురస్క రించుకునే దేశాయి వీరి వివాహానికి ప్రోత్సాహం కలిగిం చాడు !

ఈ వివాహం కాశ్మీర సంప్రదాయానుగుణ్యంగా సనా తన పద్ధతిని వైభవంగా జరిగింది. వివాహానికి కేవలం బంధువులు మాత్రమేకాక, గాంధీజీ, ఆలీ సోదరులు, కాంగ్రెసువర్కింగ్ కమిటీ సభ్యులందరూ ఆహ్వానితులైనారు. ఆ వారంలోనే వర్కింగ్ కమిటీ సమావేశం అలహాబాదులో ఏర్పాటయింది. ఇంతమంది నాయకులు రావటం ఎరిగి, స్థానిక కాంగ్రెసు నాయకులు ఈ అవకాశాన్ని వృధాపోనియ్య కుండా జిల్లాకాంగ్రెసు మహాసభనుకూడా జరుపటానికి ఏర్పాట్లు గావించారు. సాధారణంగా ప్రశాంతంగా ఉండే ప్రయాగ (అలహాబాదు) ఈ వైభవాలతో, వేడుకలతో, ఎంతో ఉత్సాహంగా ఉన్నట్లు కన్పించింది. ఈ సంచలనం రాజకీయాధికారులకు రవరవ పుట్టించింది. నగరంలో ఏదో విప్లవం రేకెత్తుతుందేమో అని అనుమానించారువారు. ఏ వేళకేమి ముప్పు వాటిస్తుందో అని, అధికారులు రివా ల్వర్లను సిద్ధంచేసుకున్నారు. ఆత్మరక్షణకు అలహాబాదు ఫోర్టులో కొంత సైన్యాన్ని సిద్ధంచేసి ఉంచారు. వీరికింత కంగారుకూ మూలహేతువు — అనుకోకుండా — 1857 నాటి సైనిక విప్లవదినమూ, విజయలక్ష్మి వివాహ దినమూ ఒకే రోజు అవటం. అదే మే 10-వ తేదీ. వీరపురుషుల స్మారక

దినం రోజున వివాహమైనందుకు విజయలక్ష్మి, రంజిత్ పండిట్‌లు ఎంతో గర్వించవచ్చు !

వీరి వైవాహిక జీవితం ఇంచుమించు ఇరవై సంవత్సరాలు. జీవితంలో సామాన్యంగా తటస్థించే స్వల్పమైన అవాంతరాలేవయినా కలిగినా, వీరి జీవితం ఎంతో సుఖప్రదంగా, ఆదర్శంగా గడిచింది. ఈ గృహస్థ జీవితానికి ఫలితంగా, చంద్రలేఖ, నయనతార, రీటా అని ముగ్గురు పుత్రికలు జనించారు వీరికి.

ఆనంద భవనాన్ని నిర్మించినప్పటినుంచి నెహ్రూ కుటుంబానికి, పెద్ద సర్పమొకటి ఇంచుమించు కనిపెట్టుకుని కాపాడుతూ ఉండే దనవచ్చు. ఆనంద భవనంలో చుట్టూ చిన్న చిన్నఇళ్లు (Out Houses) ఎన్నో ఉండేవి. వాటిల్లో ఒకగదిలో ఆ సర్పం స్థిరనివాస మేర్పరుచుకుంది. ఆ విషయం ఇంట్లో అందరికీ తెలుసు. అర్ధరాత్రిళ్లు ఆ సర్పమున్న గదిలోకి వెళ్లాలన్నా ఎవరికీ భయముండేదికాదు.

కాని 1920 లో క్రొత్తగా వచ్చిన నౌకరు ఒకడు ఈ సర్పానికి కుటుంబానికి కలస్నేహసంపద తెలియక హఠాత్తుగా చంపివేశాడు దాన్ని. అప్పటినుంచీ ఆనందభవనంలో ఎంతో మార్పు వచ్చిందట. అంతవరకు ఎంతో వైభవంగా జీవితం నడుపుతున్న నెహ్రూ కుటుంబీకులు నిరాడంబర జీవితానికి అలవాటయ్యారు. ఆనాటినుంచి మోతీలాల్ లక్షలాది రాబడి గల వృత్తిని వదిలేశాడు. తండ్రీకుమాళ్లు ఇద్దరూ జైలుకు వెళ్లారు. ఈ సంఘటనలన్నీ ఆ సర్పమరణంవల్ల కలిగినవేనని అంటారని కృష్ణ వ్రాసింది. కాని అప్పటినుంచే నెహ్రూలు

స్వాతంత్ర్య ప్రాప్తిని ప్రధాన లక్ష్యంగా భావించి అహో రాత్రాలూ దేశసేవకై కృషి చేస్తున్నది.

జవహరు పండితుడు—తాను రాజకీయరంగంలో ప్రవేశించింతర్వాత కుటుంబాన్ని, భార్యను కుమార్తెను కూడా విస్మరించానని పేర్కొన్నాడు తన జీవితచరిత్రలో.

ఇందిరాప్రియదర్శిని జవహరుని ఏకైక సంతానం. ఆమె 1917 లో జన్మించింది.

1921 లో కాంగ్రెసు నాయకుల్నిమాత్రం ప్రభుత్వం జైళ్లకు పంపింది, కాని ప్రజల్నిమాత్రం అరెస్టు చెయ్య లేదు. ఆ సందర్భంలో నెహ్రూద్వయాన్ని ఇంకా జైలుకు పంపలేదు. కాని ఆ సంవత్సరమే వేల్సు యువరాజు ఇండియాకు వస్తున్న సందర్భంలో ఉత్సవాలను, ఊరేగింపులను నిషేధించాలని కాంగ్రెసు ఆదేశించింది. తత్ఫలితంగా దేశమంతటా అరెస్టులు చెలరేగాయి. నెహ్రూద్వయం కూడా జైళ్లకు వెళ్ళవలసి వచ్చింది.

జైళ్ళల్లో ఉన్నప్పుడు జీవితంలోని ఆనందమయ సంఘటనలనెన్నో జారనిడుచుకోవలసి వస్తుంది—ముఖ్యంగా, 'పసిపిల్లల కేరింతాలు చిరునవ్వులు, స్త్రీల కంఠస్వరాలు వినటం వల్ల కలిగే ఆనందమయ సంఘటనలు చూచే అదృష్టం లభించదు.' అన్నాడు జవహరు జైలుజీవితాన్ని గురించి ముచ్చటిస్తూ.

జవహరు ఆసారి జైలుకేగినప్పుడు కుమార్తె ఇందిరకు ఇంచుమించు నాలుగు సంవత్సరాల వయస్సు! విజయలక్ష్మి

తొలిసారిగా జైలుకెళ్ళినప్పుడు ఆమెమూడవకుమార్తె రీటాకు సరీగ్గా మూడేడ్లయినా లేవు!

చౌరీచౌరాలో ఉద్రేకపూరితులైన ప్రజానీకంమీద పోలీసులు కాల్పులు జరిపినందుకు ఫలితంగా మహాత్ముడు అసహాయోద్యమాన్ని నిలిపివేశాడు. అప్పటికి మోతీలాలు ఇంకా జైల్లోనే ఉన్నాడు. అలాఉద్యమాన్ని ఆపుచెయ్యటం ఆయనకు నచ్చలేదు—ఆయనకేకాదు జవహరుకూ ఇష్టం లేదు అది—అయినా గాంధీజీ ఉద్యమానికి సర్వాధికారి కనుక ఆయన ఆదేశాలను నెహ్రూలు ఆమోదించక తప్ప లేదు.

నెహ్రూలు జైలునుంచి తిరిగి వచ్చింతర్వాత, కాంగ్రెసు వాదులు శాసనసభల్లో ప్రవేశించవలెనా? శాసన సభలను బహిష్కరించవలెనా అనే సమస్య వచ్చింది. గాంధీజీ అభిప్రాయం బహిష్కరించవలెనని. చిత్తరంజనదాసు— శాసనసభల్లో ప్రవేశించే పోరాటాన్ని సాగించాలని సంక ల్పించాడు. మోతీలాలు, వి. జె. పటేలు మున్నగు ప్రము ఖులు చిత్తరంజనుని ప్రయత్నానికి సహాయభూతులైనారు. ఆ సందర్భంలో కేంద్ర శాసనసభాధ్యక్షుడుగా వి. జె. పటేలు ఎన్నుకోబడ్డాడు.

జవహరులాలు మాత్రం శాసనసభల్లో ప్రవేశించటానికి వీల్లేదనే గాంధీజీ అభిప్రాయాన్నే అనుసరించాడు. తర్వాత కొద్దిరోజులకే అలహాబాదు మ్యునిసిపాలిటీకి అధ్యక్షు డయ్యాడు.

ఆరోజుల్లో నెహ్రూ ద్వయాన్ని ఎలాగైన ప్రభుభక్తి పరాయణులను కావించాలని అలహాబాదు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సర్ గ్రిమ్‌వుడ్ మియర్స్ (Grimwood Mears) ఎంతో ప్రయత్నించాడు. జవహరుకు అమాత్యపదవి నిస్తామని ఆశ చూపించారు. కాని జవహరు ఈ ఆశలకు లొంగ లేదు. నాకవసరం లేదని తిరస్కరించాడు. కాని ఆ సంయుక్త రాష్ట్రాలకే, ఆ తర్వాత పదిహేను సంవత్సరాలకు, జవహరు చెల్లెలు విజయలక్ష్మి పండిట్ అమాత్య పదవిని స్వీకరించింది. కాని ఈ మధ్య కాలంలో రాజకీయంగా దేశంలో కలిగిన అనేక మార్పుల వల్ల—అలా చేయవచ్చునని కాంగ్రెసు ఆదేశించిన ఆ దేశమది.

నెహ్రూ ప్రాక్టీసును వదిలి వేసింతర్వాత ఆర్థిక బాధలకు కొన్నింటికీలోను కావలసి వచ్చింది. ప్రతి విషయంలోనూ ఖర్చు తగ్గించుకోవట మనేది ఇష్టం లేకపోయింది. మోతీలాలుకు విలువయిన సామగ్రినంతా ఎంత అమ్మినా లక్షలాదిగా ఆర్జించి ఖర్చు పెట్టుట కలవాటు పడిన ఆ శ్రీమంతుడు ఎలా కానీ సంపాదన లేకుండా గడపు కోవటం! అంచేత ఆయనకు అవకాశమున్న సమయాల్లో మళ్లీ ప్రాక్టీసు చేయవలెనని సంకల్పించుకున్నాడు. దానివల్ల ఆర్థికంగా కొంత స్తోమత ఏర్పడుతూ ఉండేది.

1924 సంవత్సరంలో గాంధీజీ ఆరోగ్యం కోసమై సముద్ర తీరాన కుటీరాన్ని నిర్మించుకుని (Juhu) ఉన్నప్పుడు నెహ్రూ కుటుంబంకూడా విశ్రాంతి కోసమని అక్కడికి వెళ్లి కుటీరాన్ని నిర్మించుకుని కొన్ని వారాలు గడిపింది.

గాంధీజీతో సంప్రతింపుల ఫలితంగా మోతీలాలు తన దృక్పథాన్ని (స్వరాజ్య పార్టీ) మార్చుకోలేదు. ఇద్దరూ ఏకాభిప్రాయానికి రాలేకపోయారు.

1925 సంవత్సరంలో విజయలక్ష్మి రంజిత్ పండిట్ యూరప్ సంచారం చేయాలని నిశ్చయించుకున్నారు. ఆ సంవత్సరమే జవహరు పండితునిభార్య కమలా నెహ్రూకు ఆరోగ్యం చెడుటవల్ల, డాక్టర్లు కొందరు స్విట్జర్లండు తీసుకు వెళ్ళవలసిందిగా సలహా ఇచ్చారు. అంచేత 1926 మార్చిలో జవహరు, కమల, ఇందిర యూరపుకు ప్రయాణ మయ్యారు. విజయలక్ష్మి దంపతులుకూడా వారితో కలిసే ప్రయాణం చేశారు.

విజయలక్ష్మి దంపతులు కొన్నాళ్లు ప్రపంచయాత్ర చేసి, తగినంత ప్రాపంచికానుభవాన్ని సంపాదించుకుని, ఇండియాకు తిరిగివచ్చారు.

మళ్లీ యూరప్ సంచారానికి జవహరు, కమల, విజయలక్ష్మి, రంజిత్ పండిట్ బయలుదేరిం తర్వాత, మిగిలిన వారుకూడా యూరప్ వెళ్లటానికి ప్రయత్నించారు. మోతీలాలు—విజయలక్ష్మి చెల్లెలు కృష్ణ కలిసి వెళ్లాలని సంకల్పించుకున్నారు. కాని మోతీలాలుకు అర్జంటు అయిన కేసు ఒకటి ఉండుటచే వెళ్లటానికి వీలులేక పోయింది. అంచేత కృష్ణ ఒంటరిగానే వెళ్ళటానికి నిశ్చయించుకుంది. తల్లి స్వరూపరాణికి యిష్టంలేకపోయినా కుమారెకోరికను కాదనలేకపోయింది.

జవహరులాల్ అప్పుడు జెనీవాలో ఉంటున్నాడు. అతడు కృష్ణను 'బ్రిండ్‌సీ' లో కలుసుకోవాలనుకున్నాడు కాని రైలు తప్పటంవల్ల కలుసుకోలేక పోయాడు. అంచేత నేపుల్స్ చేరుకునేవరకు ఆమె ఒంటరిగానే రావలసివచ్చింది. అక్కడ కలుసుకున్నాడు జవహరు.

1927 సంవత్సరం వేసవిలో మోతీలాలు పండితుడు కూడా యూరప్ వెళ్లాడు. కొంతకాలం యూరప్‌లో ఉండి, ఆయున్ని విశ్రాంతి తీసుకోమని, విజయలక్ష్మి, రంజిత్ పండిట్‌లు ఎంతో నచ్చచెప్పారు. జవహరు ఉద్దేశ్యంకూడా అదే.

మోతీలాల్ యూరపు వెళ్లటానికి ముందే జవహరు కమల, ఇందిర, ఇండియాకు తిరిగివచ్చారు. అంతకుముందే విజయలక్ష్మి రంజిత్ పండిట్‌లు తిరిగివచ్చారు.

మోతీలాలు యూరపులో ఉండగానే విజయలక్ష్మి దంపతులు మళ్ళీ యూరపుకు ప్రయాణమయ్యారు. వెళ్ళేప్పుడు తమ చిన్ని కూతుళ్ళు చంద్రలేఖ, నయనతారలను మోతీలాలు సతీమణికి అప్పగించివెళ్లారు. కానిఆమె అప్పుడు అస్వస్థతగా ఉండటంవల్ల ఆ పిల్లల సంరక్షణ కృష్ణహతీసింగు వహించవలసి వచ్చింది.

## ఉప్పు సత్యాగ్రహం

జవహర్లాలు నెహ్రూ ఇంగ్లాండునుంచి తిరిగి వస్తూనే మద్రాసు 1927 సంవత్సరములో జరిగిన కాంగ్రెసు మహా సభకు హాజరైనాడు. అతడితోకూడా విజయలక్ష్మి, కృష్ణ,

అందరూ ఉన్నారు. ఆ సభలో అతను ప్రవేశపెట్టిన తీర్మానాలు అన్నీ నెగ్గాయి.

తర్వాత ఇండియాకు సైమన్ కమీషను వచ్చింది. ఆ వచ్చిన ఏడుగురిలో ప్రస్తుతం బ్రిటిషు ప్రభుత్వ ప్రధానామాత్య పదవి నిర్వహిస్తున్నక్లెమెంట్ ఆట్లీకూడా ఉన్నాడు. సైమన్ కమీషన్ వచ్చినచోటల్లా అసమ్మతిని సూచిస్తూ నల్లజెండాలు చూపబడ్డాయి. లక్నోకు వీరు రానున్నారని తెలిసి జవహరు వెళ్లాడు. అక్కడ ప్రస్తుతం సంయుక్త రాష్ట్రాలకు ప్రధానమంత్రి అయిన గోవిందవల్లభపంత్, జవహరు వాలంటీర్లను తయారుచేసి, అందరూ రైలుకు ఎదురుగా నల్ల జెండాల ప్రదర్శనం జరిపారు. తత్ఫలితంగా మొదటిసారిగా జవహరు లాఠీదెబ్బలను చవిచూశాడు. అయితే జవహరుకు అంత ప్రమాదమయిన దెబ్బలు తగ్గల లేదు. కాని గోవిందవల్లభ పంతుకు మాత్రం తీవ్రమైన దెబ్బలు తగిలాయి.

1928 సంవత్సరం కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభకు మళ్ళీ మోతీలాల్ నెహ్రూ అధ్యక్షుడయ్యాడు. ఆసంవత్సరం వలంటీర్ల దళాధిపతి నేతాజీ సుభాస్ చంద్ర బోసు. మోతీలాల్ కుటుంబంలోని వారంతా ఆసభకు హాజరైనారు. అక్కడే ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి సంవత్సరంలోగా ఇవ్వాలని తీర్మానించబడింది. కాని, అది జరగలేదు. తండ్రి అధ్యక్షతను జరిగిన ఆ తీర్మానానికి ప్రతికూలంగా ఓటుచేశాడు జవహరు. ఈ విషయమై గాంధీ

ఇర్విన్‌లకు లేఖలద్వారా జరిగిన సంప్రతింపులు వ్యర్థమైనాయి.

1929 సంవత్సరంలో జవహరు తొలిసారిగా లాహోరులో జరిగిన కాంగ్రెసు అధ్యక్షుడయ్యాడు. తండ్రీకొడుకులు వరుసగా ఇలా అధ్యక్షులవటం సాధారణంగా ఎక్కడా జరిగి ఉండదు. మరో విశేషమేమిటంటే సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ఆ సభలోనే అంగీకరింపబడింది. ఎంతోమంది ఉత్సాహంతో ముందుకు వచ్చి స్వాతంత్ర్య శపథం గైకొన్నారు. ఈనాటి వరకు జనవరి 26–వ తేదీన మనం జరుపుతున్న స్వాతంత్ర్యదినం అదే.

1930 సంవత్సరం మార్చి 30–వ తేదీన మహాత్ముడు ఉప్పు (దండి) సత్యాగ్రహం ప్రారంభించాడు. 1921 లో జరిగిన అసహాయోద్యమంకన్న దేశమంతా విరివిగా విస్తృతమైనదీఉద్యమం. అలహాబాదులో ప్రభుత్వంవారి ఉప్పు శాసనాన్ని ఉల్లంఘించి స్వయంగా మొదట ఉప్పు తయారు చేసింది జవహరు. ఈ సందర్భంలో అతడి సోదరీమణులు విజయలక్ష్మి, కృష్ణ ఇద్దరూ ఉత్సాహంతో పాల్గొన్నారు.

ఆ సంవత్సరం ఏప్రియల్ 14–వ తేదీన కాంగ్రెసు అధ్యక్షుడు జవహరు అరెస్టు అయినాడు. కుమారుని స్థానంలో అస్వస్థతగా ఉంటున్నా తండ్రి మోతీలాలు తాత్కాలికాధ్యక్షుడుగా అధికారం స్వీకరించాడు.

విజయలక్ష్మిపండిట్ దీక్షగాపనిచేసింది. ఈ ఉద్యమంలో విరివిగా ఉపన్యాసాలిచ్చింది. ఉత్సవాలూ, ఊరేగింపులు జరిపించింది. క్షణం తీరికలేకుండా సర్వతోముఖంగా ఉద్య

మాన్ని నడిపింది. ఒక్క నెలపాటు రాజకీయాలతో సంబంధం ఉంచుకోకూడదని ప్రభుత్వం ఆమెకు నోటీసు జారీచేసింది. కాని, ఈ ఉత్తర్వును పాటించి మెదలకుండా ఆమె కూర్చో లేకపోయింది. స్వాతంత్ర్య విహీనంగా బాధపడుతున్న తన దేశప్రజలకు సహాయపడకుండా ఊరుకోలేకపోయింది.

తర్వాత జూన్‌లో మోతీలాలుతో కూడా ఆమె బొంబాయి వెళ్ళింది. జవహరుభార్య కమల, తల్లి స్వరూపరాణి కూడా ఉన్నారు. అక్కడ వీరికి ఘనమైనస్వాగతమిచ్చింది ప్రజానీకం. అక్కడనుంచి తిరిగివస్తూండగా జూన్ 30 వ తేదీన ప్రభుత్వం మోతీలాల్‌ను అరెస్టుచేసింది. కాంగ్రెసు కార్యవర్గం న్యాయబద్ధమైనది కాదని ప్రకటించి ప్రభుత్వం కార్యవర్గసభ్యులనందర్నీ అరెస్టుచేసింది. క్రొత్త సభ్యులను ఎప్పటికప్పుడు చేర్చారు. వారిలో జవహరు సతీమణి, కమలకూడా సభ్యురాలు.

తర్వాత కొద్దిరోజులకే విజయలక్ష్మి భర్త రంజిత్ పండిట్ కూడా అరెస్టుఅయ్యి, జవహరుతో నైనీ సెంట్రల్ జెయిలుకు పంపబడ్డాడు.

మోతీలాల్ అసలే అస్వస్థతగాఉండి, ఆరోగ్యంకోసం 'ముస్సోరి' వెడదామనుకుంటూఉండగా అరెస్టుఅయినాడు. జైల్లో పదివారాలుండేసరికి ఆయన ఆరోగ్యం మరింత పాడైంది. అంచేత ఆయన విడుదలయినాడు. అప్పటికి జవహరుకు గడువు పూర్తిఅవటంవల్ల జవహరుకూడా విడుదలైనాడు.

మోతీలాల్ ముస్సోరీకి వెళ్ళినప్పుడు ఆరుమనకు సహాయంగా విజయలక్ష్మి, తల్లి, చెల్లెలూ కూడా ఆయనతో వెళ్లారు. కమలమాత్రం కాంగ్రెసుఉద్యమంతో విశ్రాంతి లేకుండా అలహాబాదులోనే ఉండిపోయింది. జవహరు విడుదలై వచ్చింతర్వాత ఇద్దరూ కలిసి ముస్సోరీ మోతీలాలును చూడటానికి వెళ్లారు. అక్టోబరు 13-వ తేదీన అక్కడ మూడురోజులు కులాసాగా ఆనందంగా గడిచింది. కుటుంబంలోని వారంతా విజయలక్ష్మి కూతుళ్ళు, జవహరుకూతురు— అంతా అక్కడేవున్నారు. ఆ పిల్లలలో అందరికన్న చిన్నపిల్ల నాలుగేళ్ళపిల్ల, 'ఝండా ఊంచ్ రహే హమారా' అన్న పతాకగీతం పాడుతూంటే జవహరు వాళ్ళతోకలిసి ఆడుకునేవాడు. కాని ఇలా ఎనిమిదిరోజులు స్వాతంత్ర్యవాయువులు పీల్చగానే మళ్ళీ ప్రభుత్వం అరెస్టుచేసింది. మళ్లీ రంజిత్ పండిట్ ఉన్న జైలుఖానాలోకే వెళ్లాడు జవహరు.

ముస్సోరీనుంచి మోతీలాలు తిరిగివచ్చాడు. మళ్ళీ జవహరు అరెస్టువార్త ఆయనకు మానసికాందోళన కలిగించింది. కారణం ఆయనకు శరీరం అస్వస్థతగా నుండటమే. అందువలనసలు విజయలక్ష్మికాని, కృష్ణకాని, కమలకాని ఎవ్వరూ ఉద్యమంలో ఎక్కువగా పాల్గొని మిటమిటలాడే ఎండల్లో షాపులదగ్గర నిలబడి విదేశీవస్తువులను కొనవద్దని పికెటింగ్ చెయ్యటం, ఉత్సవాల్లో ఊరేగింపుల్లో పాల్గొనడం ఆయన కంత ఇష్టముండెడిదికాదు. తన అనారోగ్యస్థితిలో అందరూ తనదగ్గర కూర్చోవాలనే ఎక్కువ కాంక్షించేవాడు. కాని, వీళ్ళఉత్సాహానికి ఆయనెప్పుడూ అభ్యంతరం చెప్ప

లేదు. వీలైనంతవరకు విజయలక్ష్మి తండ్రి పరిచర్యకే ఎక్కువకాలం వినియోగించేది.

రంజిత్ పండిట్ నైనీజెయిల్లో ఉంటున్నరోజుల్లో పండిత మదనమోహన మాలవ్యా మహాశయునికూడా ప్రభుత్వం ఆజైలుకి మార్చి ప్రత్యేకంగా ఒక ఖానాలో ఉంచారు ఆయన్ని. అక్కడ విజయలక్ష్మి భర్త రంజిత్ సహాయంతో మాలవ్యాపండితుడు జర్మనీ భాషను అభ్యాసం చేశాడు. రంజిత్ పండిట్ ఇంగ్లీషుతో పాటు జర్మనీ, ఫ్రెంచి, సంస్కృతభాషల్లో కూడా ప్రవీణుడు.

1931 సంవత్సరం జనవరి ఒకటవ తేదీన జవహరు భార్య కమల కూడా అరెస్టు అయింది. అప్పటికి మోతీలాలు—కలకత్తాలో ఉన్నాడు. ఆయన కీవార్త మరీ ఆందోళన కలిగించింది. వెంటనే తాను అలహాబాదు రావటానికి ప్రయాణమయి, ముందు కృష్ణను పంపాడు. ఆయన ఆరోగ్యం ఏమీ కుదుట పడలేదు. 12 వ తేదీని నైనీ జైలుకు వెళ్లి జవహరుని చూసి వచ్చాడు. ఆ తర్వాత రెండు వారాలకు కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులంతా విడుదల చేయబడ్డారు. అది జనవరి 26 తేదీ స్వాతంత్ర్య దినం. కమల కూడా విడుదలయింది. అప్పటికి మోతీలాలు స్థితి మరింత [illegible]దంగా పరిణమించింది. రంజిత్‌ను చూడాలని మోతీలాలు ఆదుర్దా పడ్డాడు. కుమారుడు, కోడలితోపాటు కూతురు అల్లుడు కూడా దగ్గర ఉండాలని ఆయన అభిలాష. అంచేత రంజిత్ పండిట్ కూడా విడుదల అయ్యాడు. కాని మళ్లీ రెండు రోజులకే జైలుకు తిరిగి వెళ్ల వలసి వచ్చింది.

గాంధీజీ కూడా విడుదలై మోతీలాలును చూడవలెనని అలహాబాదు ప్రయాణ మయ్యాడు. విడుదలైన వర్కింగ్ కమిటీ సభ్యులంతా మొత్తం ముప్పైఎనలభైమంది స్వరాజ్య భవనం చేరుకున్నారు. తరువాత కార్యక్రమం నిర్ణయించ టానికి ఒక సమావేశం ఏర్పాటు చేశారు.

ఈ స్వరాజ్య భవనమే విజయలక్ష్మి జన్మించిన ఆనంద భవనం. దీన్ని అప్పటికి ఒక సంవత్సరన్నర క్రితమే కాంగ్రె సుకు ఇచ్చివేసి, మోతీలాల్ పండితుడు మరొక దివ్యభవనం కట్టించాడు. ఈ క్రొత్త భవనానికి ఆనందభవన మనిపేరెట్టి, పాత ఆనందభవనానికి స్వరాజ్యభవన మనిపేరు మార్చాడు.

నేను జీవించి ఉండగానే ఇండియా భవిష్యత్తును స్వరాజ్య భవనంలో నిర్ణయించాలని కోరాడు మోతీలాలు. ఆ సమా వేశం అప్పుడలా ఏర్పాటు చేసిందే.

ఆ స్థితిలో ఎప్పుడూ ఆయన ఈజీఛైరులోనే పడుండే వాడు. ఉదయం సాయంత్రం ఎంతో మంది వచ్చి ఆయన దర్శనంచేసుకుని వెళ్లేవారు.

విజయలక్ష్మి, కమల, కృష్ణ, జివహరు, తల్లి స్వరూపరాణి అంతా ఎప్పుడూ ఆయన దగ్గిరనే కూర్చుని సేవచేస్తూ ఉండే వారు. రాత్రిళ్లు వంతుల వారీగా ఒకరి తర్వాత ఒకరు మేల్కొని ఆయన్ని కనిపెట్టుకుని కూర్చునేవారు.

డాక్టర్లు ఆయన్ని ఎక్స్‌రే పరీక్ష కోసం, లక్నో తీసుకెళ్ల వలసిందని బలవంతం చేశారు. కాని అది మోతీలాల్‌కు ఇష్టంలేదు. మృత్యువు సమీపంలో ఉన్నదని తెలుసుకున్నా డాయన. మహాత్మునితో ఆయన చెప్పిన అంతిమవాక్యాలివి.

"నేను త్వరలోనే వెళ్లిపోతున్నాను. రానున్న స్వరాజ్యాన్ని చూసేందుకు నేను ఈ లోకంలో ఉండటంలేదు. కాని మీరు తప్పక స్వరాజ్యం సాధిస్తారని నా విశ్వాసం."

మహాత్ముడు కూడా లక్నో తీసికెళ్లటమే శ్రేయస్కరమనటంవల్ల కారులో ఆయన్ని లక్నో తీసికొని వెళ్లారు. ఆ రోజున ఉదయం కొంచెం తెలివిగా ఉన్నట్లే కన్పించాడు. కాని సాయంత్రానికి మళ్లీ ఆయనకు స్పృహలేదు. ముఖ కాంతి కూడా తరిగి పోసాగింది. అయినా 'ఆక్సిజన్' ఇచ్చారు. విజయలక్ష్మి ప్రభృతులంతా ఆ రాత్రి అంతా మేల్కొనే ఉన్నారు. కాని తెల్లవారు ఝామువేళ జవహరు స్వరూపరాణి తప్ప అంతా నిద్రమత్తులో పడిపోయారు.

1931 సంవత్సరం ఫిబ్రవరి 6 వ తేదీ ఉదయాత్పూర్వం మోతీలాలు ముఖంమీదికి కొంచెం చైతన్యం వచ్చినట్లుగా చూచి, జవహరు కొంచెంధైర్యంచెంది, ఆయన కళ్లుమూసుకుంటే నిద్ర పట్టుతోంది కాబోలు అనుకున్నాడు. కాని తల్లి ఏడుపు మొదలెట్టింది. ఆమెకు తెలుసు. అదిఇహ దీర్ఘనిద్రే కాని మెలకువవచ్చే నిద్రకాదని....అంతే! అదే మోతీలాల్ పండితుని దీర్ఘనిద్ర.

విజయలక్ష్మి ప్రభృతులంతా లోపలికివచ్చి చూచారు. మోతీలాల్ ముఖం ముకుళిత పద్మంలా ఉంది. జవహరుతో సహా అందరికళ్ళల్లోనూ అశ్రువులు ప్రవహించ సాగాయి. గాంధీజీ అందర్నీ ఊరడించాడు. తెల్లవారేసరికి ఇహ అక్కడికి ఆయన భౌతికదేహాన్ని చూడటానికి వచ్చిన ప్రజకు అంతులేదు.

అలహాబాదు తీసుకువచ్చి శవానికి అంత్యక్రియలు త్రివేణీ క్షేత్రంలో జరపాలని నిశ్చయించారు. కారులో శవాన్ని చేర్చారు. ఆ కారు విజయలక్ష్మిభర్త రంజిత్ పండిట్ నడిపాడు. అందులో జవహరు కూడా కూర్చున్నాడు. వెనుక మరొక కారులో గాంధీజీ, మోతీలాలు సతీమణి స్వరూపరాణి వచ్చారు.

విజయలక్ష్మి, కమల ప్రభృతులు కొంచెం ముందుగానే ఆనంద భవనానికి వచ్చారు కావలసిన ఏర్పాట్లు చెయ్యటానికి. ఆనాడు మోతీలాలుభౌతిక దేహంతో శ్మశానంవరకు వెళ్లిన జనానికి అంతులేదు. మాలవ్యా మహాశయుడుకూడా ఉన్నాడు గాంధీజీతోపాటు. "మోతీలాల్ మృత్యువువల్ల జీవితంలో ఇంక ఎప్పుడూ తీరనినష్టం సంభవించిందినాకు" అన్నాడు మహాత్ముడు.

ఆ సంవత్సరం కాంగ్రెసు కరాచీలో జరిగింది. వల్లభాయి పటేల్ అధ్యక్షుడు. జవహర్లాలు, కమల, కృష్ణ, మోతీలాలుసతి వెళ్ళారు—కాని విజయలక్ష్మిమాత్రం వెళ్లలేదు.

గాంధీ—ఇర్విను సంప్రతింపులు వ్యర్థమైనాయి. మళ్లీ ఉద్యమం తీవ్రరూపం ధరించింది. గాంధీజీ లండను రౌండు టేబుల్ కాన్ఫరెన్సుకువెళ్లి తిరిగి వస్తున్నాడు. జవహరు బొంబాయివెళ్లి ఆయన్ని కలుసుకోవాలను కున్నాడు కాని దారిలోనే జవహరుని అరెష్టు చేశారు.

క్రమశః గాంధీ, పటేలునుకూడా అరెష్టుచేశారు. విజయలక్ష్మి, కమల, కృష్ణ, ఈసారి మోతీలాల్ సతీమణి కూడా

ఉత్సాహంతో ఉద్యమంలో పాల్గొన్నారు. తన కూతుళ్లు, కోడలితోపాటు ఆమెకూడా సభల్లో పాల్గొనేది.

సభల్లోకాని, ఉత్సవాల్లోకాని, హర్తాళ్లల్లోగాని పాల్గొనకూడదని విజయలక్ష్మికి, కృష్ణకు ప్రభుత్వం నోటీసిచ్చింది. అప్పటికి స్వాతంత్ర్య దినోత్సవం ఇంక రెండువారాలుంది. ఆరోజున అలహాబాదులో వీరు ఒకసభను ఏర్పాటు చేశారు. ఆ సభకు తల్లి స్వరూపరాణి అధ్యక్షతవహించి, ఉద్రేకపూరితంగా ఉపన్యసించింది. పోలీసులువచ్చి, లాఠీచార్జిచేసి సభను చెల్లాచెదరు చేశారు. చాలామందిని అరెస్టుచేశారు. కాని విజయలక్ష్మి, చెల్లెలుమాత్రంఅప్పుడు అరెస్టుకాలేదు.

మర్నాడు, ఉదయం తొమ్మిది గంటలకు పోలీసు కారు వచ్చి ఆనందభవనం ముందర నిలబడింది. విజయలక్ష్మికి, కృష్ణకు అరెస్టు వారంటు జారీచేశారు. తల్లిని, విజయలక్ష్మి కూతుళ్లను ఆనందభవనంలో ఉంచి, జైలుకు ప్రయాణమైనారు ఇద్దరూ. విజయలక్ష్మి ఆఖరు కుమార్తెకు అప్పటికింకా మూడేండ్లయినా లేవు. ఆ అమ్మాయే 'రీటా విశిష్ట'. తల్లి అంతాజైలుకు వెళ్ళగలిగిన అవకాశం కలిగినందుకు సంతసించింది, గర్వించింది. కాని బెంగపడలేదు.

మొదట పోలీసులు విజయలక్ష్మిని, కృష్ణను అలహాబాదు జైలుకు తీసుకుపోయారు. అక్కడవారు మూడువారాలపాటు ఉన్నారు. ఆపైవిచారణజరిగింది. అక్కా చెల్లెళ్లు ఇద్దరూ డిఫెన్సు పెట్టుకోలేదు. చెరియొక సంవత్సరంశిక్షపడ్డది.

ఈజైలు శిక్షవారు లక్నోలో అనుభవించారు. ఆనందభవనంలో మహారాజుబిడ్డల్లాగ హంసతూలికా తల్పాలపై

పెరిగిన ఈ 'అసూర్యం పశ్యల'కు జైలువాసం కష్టమనిపించ లేదని చెప్పలేము. అయినా దేశంకోసం ఎన్నికష్టాలైనా అనుభవించగల గుండెనిబ్బరం వారిలో ఉంది. అప్పుడప్పుడు తల్లిమాత్రంవచ్చి చూచిపోతూ ఉండేది. ఆమె ఒక్కతేతప్ప నెహ్రూ కుటుంబమంతా ఆ రోజుల్లో జైళ్ళల్లోనే ఉంది.

జైలు జీవితం కంటకంగానే ఉన్నా అది వారికొక కొత్త అనుభవాన్ని చేకూర్చింది. దేశసేవాపరులకు ఉండవలసిన సహనశక్తి అబ్బింది. బ్రిటిష్ జైళ్ళల్లోని అధ్వాన్న పరిస్థితులు తెలిసివచ్చాయి. జైలు ఆఫీసర్లు ఖైదీలయెడ ప్రదర్శిస్తూండే క్రౌర్యం చూచారు. ఎలాగైతేనేం సంవత్సరం గడిచింది. ప్రభుత్వం వారిని లక్నోనించి అలహాబాద్ తీసుకు వచ్చి విడుదల చేసింది.

విజయలక్ష్మి, కృష్ణ విడుదలై ఇంటికి వచ్చారు. కాని ఆనందభవనం తాళంవేసి ఉంది. కమలానెహ్రూ అప్పుడు కలకత్తాలో సుస్తీగా ఉంది. తల్లికూడా ఆమెదగ్గరేఉంది. వారు విడుదలై వచ్చిన వార్త గబగబా ఊరంతా ప్రాకిపోయింది. రెండు గంటల్లో ఆనందభవనమంతా మిత్రులతో నిండిపోయింది.

తరువాత విజయలక్ష్మి, కృష్ణ కలకత్తా వెళ్ళారు. కమలా నెహ్రూకు సుస్తీ నయంకాగానే అంతాకలిసి తిరిగి అలహా బాదుకు వచ్చారు.

విజయలక్ష్మి జైలుకు వెడుతూ తనముగ్గురు కూతుళ్లనూ పూనాలో ఒక బోర్డింగు స్కూల్లో అట్టిపెట్టి వెళ్ళింది. అప్పటికి చిన్నకూతురికి మూడేళ్ళ వయస్సు మాత్రమే. వాళ్ళను

తాను ముద్దులాడి సంవత్సరమైంది. వెళ్ళి తనబిడ్డల్ని చూడాలని ఆ మాతృహృదయం వేగిరించింది. వెంటనే బయలుదేరి పూనా వెళ్ళింది. కృష్ణకూడా ఆమెతోనే వెళ్ళింది. జవహర్ పండితునికూతురు ఇందిరకూడా ఆ బోర్డింగు స్కూల్లోనే ఉంది. విజయలక్ష్మి, కృష్ణ పూనావెళ్ళి ఆ పిల్లల్ని తీసుకుని బొంబాయి వచ్చారు. పూనాలో ఉన్నరోజుల్లో యరవాడ జైల్లోఉన్న గాంధీజీని చాలసార్లు దర్శించారు.

బొంబాయిలో ఉన్నప్పుడే కృష్ణకు హాతీసింగ్‌తో ప్రథమ పరిచయం అయింది. తరువాత మరినాలుగు నెలలకు అక్కచెల్లెళ్ళిద్దరూ ముస్సోరీ వెళ్లారు. అక్కడినించి అహమదాబాద్ వచ్చారు. అహ్మదాబాద్‌లో మరొకసారి హాతీసింగ్‌ను కలుసుకోవటం తటస్థించింది. కృష్ణ వలపు తలపులు ఆ చిన్నవానిపై ప్రసరించినవి. తానతన్ని వివాహమాడగోరుతున్నానని అక్కతో చెప్పింది. ఆ సంగతి తల్లితో చెప్పవద్దని కూడా చెప్పింది. అప్పుడు తల్లికి ఒంట్లో. సుస్తీగా ఉంటోంది. ఆ సుస్తీ కాస్త నయం అయాక తనకోరిక తల్లికి తెలియజేయవలసినదిగా కృష్ణ విజయలక్ష్మిని కోరింది. తిన్నగా ఇన్నాళ్ళనించీ ఈ అక్కచెల్లెళ్ళు తమలోనే రహస్యంగా దాచి యుంచిన విషయం బైటకి పొక్కించారు. తరువాత జవహార్ బొంబాయి వెళ్ళి రాజాహాతీసింగ్‌ను కలుసుకున్నాడు. అతనికి సంబంధం నచ్చింది. 1933 అక్టోబరు 20 తేదీన కృష్ణ — హాతీసింగ్‌ల వివాహం ఆనంద భవనంలో జరిగింది. గాంధీజీ దంపతులను ఆశీర్వదించాడు.

# అసెంబ్లీ మంత్రిణి

1934 లో ఉప్పు సత్యాగ్రహోద్యమం ఉపసంహృతమైంది. అప్పటికి అంతర్జాతీయ క్షేత్రంలో కూడా అలజడి బైలు దేరింది. నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీ స్పెయిన్‌లో జనరల్ ఫ్రాంకోకు సంపూర్ణ సహకారం ఇచ్చి పూర్వ ప్రభుత్వాన్ని కూలదోసి అతనికి పట్టాభిషేకం చేశాయి. ముసోలినీ ఫాసిజం అబిసీనియాలో విలయనృత్యం చేసింది. ఇటు చైనాలో జపాన్ ఫాసిస్టుల దాడులు విజృంభించాయి.

ఈ నాజీ ఫాసిస్టు తత్వాలు ప్రపంచానర్థదాయకము లని....అగ్రరాజ్యాల వారింకా గుర్తించని రోజుల్లోనే.... జవహర్‌లాల్ నెహ్రూ, విజయలక్ష్మీ పండిట్ మొదలైన ప్రముఖ భారత రాజకీయజ్ఞులు ఎలుగెత్తి చాటినారు. చైనా, అబిసీనియా, పాలస్తీనా, స్పెయిన్ దేశాలయెడ భారతదేశం తన సానుభూతిని ప్రకటించింది. ఆరోజుల్లోనే భారతదేశం స్వతంత్రమై యున్నట్టయితే నాజీ-ఫాసిస్టు తత్వాలను పూర్ణ పుష్టి చేకొననిచ్చేదికాదు. ద్వితీయ మహాసంగ్రామము తలసూపెడిదేకాదు.

అలాగ అంతర్జాతీయ స్థితిగతులు తీవ్ర కల్లోలితంగా తూవుంటే భారతదేశంకూడా అటువైపు ఆకర్షితమైంది. నాయకులకు అంతర్జాతీయ దృక్పథం అలవడింది. స్పెయిన్-చైనా దేశాలకు భారతదేశం వైద్యసహాయం పంపింది; ఆహార్య ధాన్యాలుకూడా అందజేసింది.

భారత దేశంలోకూడా పరిస్థితులు సాఫీగా సాగిపోవటం లేదు. లండన్‌లో మూడు రౌండుటేబిల్ సమావేశాలు జరిగినందుకు ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాకు ఒక శ్వేతపత్రం జారీచేసింది. ఫెడరల్ రాజ్యాంగం ఒకటి ప్రజలకు అంటగట్టింది. దేశరక్షణ, ఫైనాన్సు మొదలగు ముఖ్య విషయాలకు సంబంధించిన అధికారాలు తానే అట్టిపెట్టుకుని స్వపరిపాలనా బాధ్యతలు దేశీయులకే ఇచ్చివేస్తున్నా మన్నది. హిందూముస్లిం విభేదాలను రెచ్చగొట్టేందుకూ, తద్వారా ఇండియాలో తన అధికారం శాశ్వతం, సుస్థిరం చేసుకునేందుకూ కమ్యూనల్ ఎవార్డును సృష్టించింది.

ఈ రాజ్యాంగ ప్రణాళికను కాంగ్రెస్ ఆమోదించలేదు. ఇండియాపై తను పరిపాలనము సుస్థిరం చేసుకునేందుకే అట్టి ప్రణాళికను బ్రిటిష్‌వారు ప్రతిపాదించినారని నాయకులు అభిప్రాయపడినారు. కాని బ్రిటిష్ ప్రభుత్వము తప్పనిసరిగా ఫెడరల్ విధానాన్ని ఇండియాలో అమలుచేయుటకే నిశ్చయించింది. అప్పుడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమై మంత్రిపదవులు స్వీకరించటమా, స్వీకరించక పోవటమా అన్న సమస్యను చర్చించింది. శ్రీ రాజగోపాలాచార్లవారు పదవీ స్వీకరణము చేయవలసినదేనని ప్రతిపాదించాడు. విజయలక్ష్మి ఆ ప్రతిపాదనమును తీవ్రంగా ఖండించింది.

కాని ఎన్నికలలోనిల్చి, శాసనసభల్లో ప్రవేశించి, మంత్రిత్వాలు స్వీకరించి, శాసనసభల్లోనూ, శాసనసభలకు బైట కూడా ఈ కొత్తరాజ్యాంగాన్ని ప్రతిఘటించుటకే కాంగ్రెస్ తీర్మానించింది చివరకు.

ఎన్నికలు ఆరంభమైనాయి. అప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉండిన జవహర్ పండితుడు లౌడ్ స్పీకర్లు పుచ్చుకుని రైళ్ళమీద, కార్లమీదా, గుర్రాలమీదా, ఏనుగులమీద, ఒంటెలమీద, సైకిల్ మీద, ఆఖరుకు ఎద్దుబండ్లమీద కూడా దేశమంతటా మూలమూలలా శ్రమయనక తిరిగి రోజుకు పన్నెండు ఉపన్యాసాల చొప్పున చెబుతూ అఖండమైన ప్రచారం చేశారు. మారుమూల పల్లెలలో ఉన్న రైతులకుకూడా ప్రబోధం కలిగింది. "బాబూజీ! హమారీ ఆంఖోంకాపరదా గిర్ గయా!!" (మాకళ్లు తెరువుళ్ళయినాయి) అన్నారు ప్రజలంతా. పదకొండింట ఏడురాష్ట్రాలలో కాంగ్రెస్ గెలిచింది. అంటే — "ఈ నూతన రాజ్యాంగం మాకక్కర్లేదు. మా ప్రజాపరిషత్తు ఏర్పడి అది నిర్ణయించిన రాజ్యాంగమే మాకు కావాలి" అని కాంగ్రెస్ నుడివిన 'మాటే ప్రజావాక్య'మైనదన్నమాట!

విజయలక్ష్మి (కాన్పూర్‌లో) బిల్‌హార్ గ్రామనియోజకవర్గంలో కాంగ్రెస్ అభ్యర్థినిగా నిల్చుంది. ఆమెకు ప్రత్యర్థిని శ్రీవాస్తవసతి. శ్రీవాస్తవ విద్యాశాఖమంత్రిగా ఉండేవాడు. అంతకుముందెన్నడూ విజయలక్ష్మి ఎన్నికల ప్రచారంలో పాల్గొనియుండలేదు. ఐనా అప్పటికి ఇంగ్లీషులోనూ, హిందీలోనూ బాగా ఉపన్యాసాలివ్వటం అలవాటైపోయింది. మధురమైన కంఠం; మృదువైన భాష; శ్రోతలను ఆకర్షించగలిగింది.

జడుపు గిడుపు లేకుండా ఉపన్యాసాలివ్వగలుగుటకు తండ్రి మోతీలాల్ ఆమెకొక కిటుకు చెప్పాడు చిన్నప్పుడు. "నువ్వు

చెప్పదలచుకున్నదంతా ఒకసారి ముందుగా మనసులో నెమరువేసుకో. తరువాత దాన్ని మరచిపో. ఇక వేదిక యెక్కి ఏమీ తెలియని మందమతులకు ఉపన్యాసం ఇస్తున్నా ననుకుని ఆరంభించు"— అని ఉపదేశించాడట ఆ యనుభవజ్ఞుడు.

ప్రత్యర్థినిని ఓడించి, అసెంబ్లీసీటు సంపాదించేనిమిత్తం విజయలక్ష్మి పల్లె పల్లెలకు వెళ్ళి, ప్రజలతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకుంది. ఈ సందర్భంలో అనారోగ్యానికి పుట్టిళ్ళుగాఉన్న కుగ్రామాలలో 'అన్నమో రామచంద్రా' యని అల్లాడిపోతూన్న బీదప్రజల అవస్థలు ఆమె కళ్ళారా చూచింది.

ఎన్నికల ప్రచారం చేస్తూ ఆమె ఒకనాడు రైల్లో ప్రయాణం చేస్తోంది. ఆమె ఎక్కిన డబ్బాలోనే ఒక భారత విద్యార్థి, ఒక అమెరికా దేశీయుడూ ప్రసంగవశాత్తు ఎన్నికల గురించి మాటాడుకుంటున్నారు వారిరువురికీ ఆ చేరువన కూచున్న వ్యక్తి విజయలక్ష్మని తెలియదు. విజయలక్ష్మి విజయం తథ్యమని చెప్పాడు భారత విద్యార్థి. "అంతగా ప్రజలపొగడ్తకు పాత్రురాలైన ఆమె ఏమిచేసిందేమిటి?" అని ప్రశ్నించాడు అమెరికా దేశీయుడు. "ఏమీ చేయనక్కర్లేదు; ఆమెమా తల్లి, మా సోదరి, ఆమె గెలుస్తుంది," అన్నాడు ఆ భారత విద్యార్థి. ఈవిధంగా యువతీ యువకులకామెఅత్యంత ప్రేమపాత్రురాలైంది. ధన్యాతిధన్య !

చివరకు ఎన్నికలలో విజయలక్ష్మికే విజయం లభించింది. వెయ్యివోట్ల మెజారిటీతో ఆమె గెలిచింది. పండిట్ గోవింద

వల్లభపంత్ సంయుక్తరాష్ట్ర ప్రధానియైనాడు. ఆతడు విజయలక్ష్మిని తన మంత్రి వర్గంలోనికి ఆహ్వానించాడు. స్థానిక స్వపరిపాలన శాఖా మంత్రిత్వాన్ని చేపట్టింది ఆమె.

"చిన్నప్పటినించీ కూడా విజయలక్ష్మి మంచి బుద్ధి చాక చక్యం గల మనిషి. నిజంగా మంత్రిణి కాదగిని ప్రజ్ఞాశాలిని. ఏ విషయానికీ ఊరికే ఆతృతపడదు. కంగారు లేకుండా శాంతంగా ఎంతపనైనా విసుక్కోకుండా చేస్తుంది. అంద గత్తె; ఆత్మ నిగ్రహం గల మనిషి; ప్రజాళిని నిమిషంలో ఆకర్షించేయగలదు." అని చెల్లెలు కృష్ణ యిచ్చిన యోగ్యతా పత్రం ఉన్నది విజయలక్ష్మికి.

కనుక గోవింద వల్లభపంత్ ఆమెను తన మంత్రివర్గం లోకి తీసుకున్నాడంటే ఆశ్చర్యం లేదు. 1937 జులై 29 తేదీన ఆమె సంయుక్తరాష్ట్ర అసెంబ్లీలో స్థానిక స్వపరిపా లనా శాఖా మంత్రిణిగా ప్రమాణం స్వీకరించింది.

భారత పార్లమెంటరీ చరిత్రలో ప్రథమ మంత్రిణి విజయ లక్ష్మి. ఆమె మంత్రిణికావటం భారత నారీలోకానికి కీర్తి. కొడుకు వలెనే కూతురు కూడా భారత రాజకీయ రంగంలో అగ్రగామినియైన దని స్వర్గంలో ఉన్న మోతీలాల్‌కు సం తృప్తి. నెహ్రూ వంశానికి శాశ్వత కీర్తి.

మంత్రిత్వ బాధ్యత లెట్టివో అంతవరకు విజయలక్ష్మి కేమీ తెలియవు. అయినా ఆశాశ్రద్ధలు గల వారికి దుస్సా ధ్యమేమున్నది ? నిశితమైన బుద్ధికూడ ఉన్నది గనుక త్వర లోనే ఆమె తన పదవీ బాధ్యతా నిర్వహణానికి వలసిన సామర్థ్యాన్ని పుంజుకో గలిగినది.

అసెంబ్లీ సమావేశంలో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టాన్ని నిరసిస్తూ, ప్రజా పరిషత్తుచేత నిర్ణయము కావలసిన కొత్త చట్టాన్ని కోరుతూ, ప్రథమ తీర్మానాన్ని ప్రవేశ పెట్టటానికి కాంగ్రెస్ ప్రభుత్వం తలపెట్టింది. ఆ తీర్మానం ప్రవేశ పెట్ట వలసినది ప్రధానమంత్రి గోవింద వల్లభపంత్. కాని ఆయనకు సుస్తీగా ఉండి సమావేశానికి రాలేదు. ఆ బాధ్యత విజయలక్ష్మి నిర్వహించవలసి వచ్చింది.

“గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టం (1935) ప్రజాభిప్రాయాన్ని ప్రతిఫలించటం లేదు. అది మిక్కిలి అసంతృప్తికరంగా ఉంది. భారతీయులను శాశ్వత దాస్యంలో ఉంచుటకుగాను ఉద్దేశించినట్టు తోస్తుంది. కనుక ఈ చట్టం ఉపసంహృతం కావాలి. దానిస్థానే వయోజన వోటింగు పద్ధతిని ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తు రచించిన రాజ్యాంగ ప్రణాళికను అమలు చేయాలి”—ఇది ఆ తీర్మాన సారం.

ఆ తీర్మానాన్ని ప్రతిపాదించి సమర్థిస్తూ విజయలక్ష్మి చక్కగా ఉపన్యసించింది. అసెంబ్లీలో ఆమెయిచ్చిన ప్రథమ ఉపన్యాసం అదే. అయినా ఆమె తబ్బిబ్బు పడలేదు; జంకు గొంకులు చూపలేదు.

తాను గ్రామనియోజక వర్గంనించి వచ్చిన ప్రతినిధినన్న విషయం విజయలక్ష్మి మరచిపోలేదు. ఎన్నికల ప్రచార సందర్భంలో ఆమె సంచారం చేసినప్పుడు గ్రామాల దుస్థితులు, గ్రామీణుల అవస్థలు కళ్ళారా చూచింది. మంత్రిణినైనానుకదా అన్న సంతోషంలో, టీపార్టీల హడావిడులలో, టెన్నీసు పోటీపందెములకు హాజరౌతూ, అనేక వినో

దాలలో కాలం బుచ్చుతూ గ్రామీణుల ఇబ్బందులను మరచిపోవచ్చునా? ఆమె మరచిపోలేదు. అనారోగ్యం, తిండి లేమి, అకాల మరణాలు, మలేరియా జాడ్యం, అవిద్య—నానాకుళ్ళతో నిండివున్న గ్రామాలు అనవరతం ఆమె కళ్ళ ముందు కనిపిస్తోనే ఉన్నాయి. తనకు చిన్నప్పటినించీ నివాస యోగ్యమై యుండి, సకలసౌఖ్య నిలయమైన ఆనంద భవనానికీ, ఈ కుగ్రామాలకూ ఎంత అంతరం ఉంది! నేడు నిత్యదారిద్ర్య సంపీడితములై యున్న ఈ క్షుద్ర గ్రామాలన్నీ ఏనాటికైనా ఆనందభవనాలు కావద్దా? సరియైన పోషణ లేక బ్రతకటమే దుర్లభంగా ఉండిన శిశువులు—యకృత్ ప్లీహ వ్యాధులతో ఉదరాలు పెరిగిపోయి, కాళ్ళు ఊచుకు పోయిన పిల్లలు—విద్యాగంధం లేక పశుతుల్యులుగా ఉన్న యువకులు—వైద్యసదుపాయాలు లేక మరణమే శరణ్యంగా మంచంబట్టియున్న వ్యాధిపీడితులు—ప్రసవవైద్యం ఏమాత్రమూ తెలియని మోటు మంత్రసానుల చేతుల్లో ప్రాణాలు విడుస్తోన్న గర్భిణులు—ఇట్టివారందరికీ.... తాను రాష్ట్రమంత్రిణియైయుండి చేయదగిన ఉపకారం ఏమైనా ఉందా? తాను స్థానిక స్వపరిపాలనశాఖా మంత్రిణి. ఆరోగ్యశాఖ కూడా తనపోర్టు ఫోలియో లోనిదే.

కనుక ప్రప్రథమంగా గ్రామ ప్రజలకు వైద్యసౌకర్యాలు చేకూర్చేందుకు విజయలక్ష్మి 1938—39 సంవత్సరానికి ఒక ప్రణాళిక తయారు చేసింది. దాని ప్రకారం మొత్తం మూడు వందల గ్రామ ఆసుపత్రులు స్థాపితం కావాలి. అందులో రెండు వందలు భారత సాంప్రదాయాను గుణ్యమైన

ఆయుర్వేద—యూనానీ ఆసుపత్రులు. మిగిలినవాటిలో ఆంగ్లవైద్యమే. ఈ ప్రణాళిక అమలు చేయబడినది. తద్వారా మూలబడి పోతూన్న ఆయుర్వేద—యూనానీ వైద్య సాంప్రదాయాలను పునః అభివృద్ధికి తీసుకురావటమైనది.

ప్రసవ వైద్యశాలలు నెలకొల్పుటకుకూడ విజయలక్ష్మి చాల ప్రయత్నించినది. బాల్యవివాహాల మూలమున అనేక మంది భారతస్త్రీలకు ప్రసవగండం గడచి బైటపడటం మహా దుర్ఘటమైపోయింది. ప్రసవవైద్యం తెలిసిన మంత్రసానులను తయారు చేసేందుకై రెడ్‌క్రాస్ సంఘానికి ప్రభుత్వ సహాయం ఇప్పించింది విజయలక్ష్మి. కాని ఈకృషి అంతగా ఫలించలేదు. ఎందువల్లనంటే—మంత్రసానితనం అగౌరవమైనదిగా చాలమంది భావించుతారు. అందుచేత ఆవిద్యలో తర్బీతుపొందే నిమిత్తం స్త్రీ లెవరూ ముందుకు రాలేదు. కొలదిమంది కిరస్తానీ యువతులుమాత్రం తర్బీతు పొందగలిగారు. 1939 లో ఆగ్రాలోని స్త్రీల వైద్యకళాశాల శిశుపోషణాలయంగా మార్చినారు.

సంయుక్తరాష్ట్రగ్రామాల్లో మలేరియావ్యాధి విస్తృతంగా ఉండేది. దాన్ని అరికట్టేందుకు విజయలక్ష్మి కొన్ని యేర్పాట్లు చేయించింది. అందుకై 80 వేల రూపాయలు మంజూరు చేయించింది.

కొన్ని కుగ్రామాలలో త్రాగటానికి మంచినీళ్లుకూడా ఉండవు. అట్టిచోట్ల బావులు త్రవ్వించేందుకు 35 వేల రూపాయలు రాష్ట్రీయబడ్జట్ నించి విజయలక్ష్మి యిప్పించింది.

పిల్లల ఆరోగ్యానికి వ్యాయామం అవసరం. 'అందుకుగాను అనేక పట్నాల్లోనూ పల్లెలలోనూ ఆటస్థలాలను ఏర్పాటు చేయించింది విజయలక్ష్మి. 1938—39 లో అందుకుగాను ఆమె మొత్తం 48 జిల్లాలలో 45 వేల రూపాయలు వెచ్చించింది. పిల్లలు ఆడుకునేందుకుగాను ఆటస్థలాలను, వ్యాయామ శిక్షణకోసం తాలింఖానాలను నెలకొల్పవలసినదిగా జిల్లా బోర్డులకు, మునిసిపల్ సంఘాలకు ఉత్తరువులు జారీచేసింది. గ్రామాలలో మొత్తం 175 ఆటస్థలాలు ప్రత్యేకితములైనాయి, ఆమె మంత్రిణిగా ఉన్నప్పుడు.

48 కొత్త ఆసుపత్రులు, 24 మాతా శిశుపోషణాలయాలు, 192 ఔషధశాలలు, దవాఖానాలు ఆమె 1938–39 లో నెలకొల్పింది. మరుసటి సంవత్సరంలో అవి ఇంకా పెరిగినవి.

ఆటస్థలాలలో పిల్లలు వ్యాయామానంతరం అలసిపోతారుకాదా ! అప్పుడు వారికి త్రాగేందుకు పాలు సప్లయి అయే ఏర్పాట్లుకూడా చేయాలని విజయలక్ష్మి ప్రయత్నించింది. కాని డబ్బుయిబ్బందివల్ల ఆ ప్లాను కొనసాగలేదు. అది ఒక్క ఆగ్రాజిల్లాలో మాత్రం కొంతవరకు అమలు జరిగింది.

రాత్రి పాఠశాలలను నిజమైన ప్రయోజన విద్యాసంస్థలుగా మార్చేందుకామె చాల ప్రయత్నించి రష్యన్ విద్యావిధాన సూత్రాల ననుసరించి భారతపరిస్థితుల కనుగుణ్యంగా ప్రయోజన విద్యా సంస్థలను సాగించుట కామె

కృషి చేసింది. విజయలక్ష్మి మంత్రిణిగా ఉన్నప్పుడు జారీ యైన చట్టాలు:

సంయుక్తరాష్ట్ర మునిసిపాలిటీస్ ఎమెండుమెంటు బిల్లు.
సంయుక్తరాష్ట్ర జిల్లాబోర్డుల ఎమెండుమెంటు బిల్.
సంయుక్తరాష్ట్ర ఇండియన్ మెడిసిన్ బిల్లు.

ధనాభావమే లేకండావుంటే—గవర్నర్లు అనవసరంగా జోక్యం కలుగ జేసుకోకండా వుంటే—కాంగ్రెస్ మంత్రుల కార్యకలాపాలు ఎంతో ప్రజోపయోగ కరములుగా పరిణ మించేవే. మాటల్లో మాత్రమే రాష్ట్రీయ స్వపరిపాలనము భారతీయులపరం చేసినట్లు బ్రిటిష్ పెద్దలు చెప్పారు. కాని ఆ రాష్ట్రీయ స్వపరిపాలనము నేతి బీరకాయ వంటిది మాత్రమే. గవర్నర్లు నిరంకుశంగానే ప్రవర్తించారు. సింధు గవర్నరు ప్రధాని అల్లాభక్సును బర్తరఫ్ చేశాడు. ఎందుకు? ఖాన్ బహాదూర్ బిరుదును పరిత్యజించాడు గనుక. బెంగాల్‌లో మంత్రివర్గంవారి పరిపాలనా విధానంలో మాటి మాటికీ గవర్నరు జోక్యం కలుగ జేసుకుంటున్నాడనే, అందుకు నిరసన సూచకంగా ప్రజామంత్రి శ్రీ శ్యాం ప్రసాద్ ముఖర్జీ రాజీనామా యిచ్చి బైటికి వచ్చేసి—'ఈ రాష్ట్రీయ స్వపరిపాలనము హాస్యాస్పద మైనది' అని బహి రంగంగా చెప్పివేశాడు.

ఇంతలో 1939 సెప్టెంబరులో ద్వితీయ మహాసంగ్రామం ఆరంభమైంది. యుద్ధాశయాలు సరిగ్గా నిర్వచించకండా ఇండి యాను కూడా యుద్ధంలోకి దింపినందుకు బ్రిటన్ యెడ నిర సన సూచకంగా భారత మంత్రులు రాజీనామాలు ఇచ్చివేసి

అసెంబ్లీలువిడిచి వచ్చేశారు. విజయలక్ష్మికూడా రాజీనామా యిచ్చి వచ్చేసింది. ఆ తరుణంలో ఆమె పలికిన ధీరవచనాలు గమనార్హములు:

"కొన్నివేల మైళ్ళదూరాన జరుగుతోన్న యుద్ధంలోకి మన దేశాన్ని కూడా దింపారు బ్రిటిష్‌వారు. అందుకు వారు మన అనుజ్ఞ తీసుకోలేదు; మనసలహా అడగలేదు. ఎందువల్ల? మనది బానిసదేశం; మన అభిప్రాయాలతో, సలహాలతో వారికి పనిలేదు. ధర్మంకోసం ఈ యుద్ధం చేస్తున్నామంటు న్నారు; వ్యక్తి స్వాతంత్ర్య రక్షణకు, జాతి సౌభాగ్యానికీ ఆధార శిలలుగాఉండే సిద్ధాంతాలకోసం ఈయుద్ధం చేస్తున్నా మంటున్నారు. కానిపైకి ఉదాత్తంగా కనిపించే ఈమాటలన్నీ మనం ఎరిగేవున్నాం. శతాబ్దాల తరబడి బ్రిటన్ ఇదేమాది రిగా యుద్ధం వచ్చినప్పుడల్లా శుష్కప్రియాలు చెబుతూనే ఉంది. కనుక బ్రిటన్ సృష్టించదలచిన ఆ నూత్న ప్రపంచ వ్యవస్థ ఎలాంటిదో వివరించమని నిలవదీసి అడగటానికి మనకు హక్కు ఉంది........

"ఉత్తుత్త వాగ్దానాలు ఇదివరకు చాలాచేసింది బ్రిటన్. మళ్ళీమనం ఆ మాయలో పడకూడదు. సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నది బ్రిటన్ మనలో మనకు విభేదాలు కొండం తలుగా చేయాలని........

"భారతీయులంతా ఐకమత్యంతో ఉన్నారని మనమిప్పుడు రుజువుచేయవలసిన సమయం వచ్చింది. భారత దేశం ఒక స్వతన్త్రరాజ్యంగా, బ్రిటన్‌తో సమాన ప్రతిపత్తిగల దేశంగా....ఇవ్వగలిగిన సహకారానికే ఏమైనా విలువ

అంటూ ఉంటుంది. బ్రిటన్ మన స్వాతంత్ర్యాన్ని నిరసించే ట్టయితే ఈ యుద్ధం రెండు సామ్రాజ్యవాదుల మధ్య ప్రపంచాక్రమణకోసం జరిగే సంఘర్షణగా దిగజారి ఊరు కుంటుంది. కనుక మనకీ సమయంలో వెనుకాడి లాభం లేదు. జ్ఞాపకముంచుకోండి — ఇండియా చస్తే బ్రతికి వుండే దెవరు? ఇండియా బ్రతికివుంటే చచ్చేదెవరు?"

## జైలు రోజులు

1938 లో విజయలక్ష్మి సంయుక్తరాష్ట్ర మంత్రిణిగా ఉన్నప్పుడే ఆమెకు మాతృవియోగం సంభవించింది. చాల రోజులనించీ తల్లి అస్వస్థతగానే ఉంటోంది. గడచిన నాలుగు సంవత్సరాల్లో ఆమెకు పక్షవాతం రెండుసార్లు తిరుగ బెట్టింది.

ఒకనాటిరాత్రి ఇంట్లో అందరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు. విజయలక్ష్మి, జవహర్‌లాల్ నెహ్రూ, కృష్ణ అందరూ ఆనాడు తల్లిదగ్గిరే ఉన్నారు. సుస్తీగాఉన్నా తల్లి ఆనాడు, ఉల్లాసంగానే చాలసేపు మాటాడుతూ కూచుంది. విజయలక్ష్మి నాటి అర్ధరాత్రి బండికి లక్నోకు ప్రయాణం పెట్టుకుంది.

ప్రయాణం ఆపుకోమని విజయలక్ష్మికి అందరూ బోధించారు. కాని లాభం లేకపోయింది. ఆమె ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకుంది.

పదకొండు గంటలైంది. ఇక స్టేషనుకు వెడదామని విజయలక్ష్మి లేచింది. లేచి తల్లిదగ్గరకు వెళ్ళింది. సెలవు

తీసుకోటానికి. మాతృవాత్సల్యంతో ఆమె కూతుర్ని కావి లించు కుందామని లేచింది. కాని మరుక్షణమే ఒరిగి పడి పోయింది. విజయలక్ష్మి ఒక్కతే ఆమెను పట్టుకోలేక పోయింది. ఇంతలో జవహర్‌లాల్, కృష్ణకూడా వచ్చి తల్లిని మంచంమీద పడుకోబెట్టారు మెల్లిగా. పక్షవాతపు మంపు వచ్చేసింది. ఆశ లేదన్నారు డాక్టర్లు.

విజయలక్ష్మి ప్రయాణం సాగలేదు. రాత్రి తల్లిదగ్గరే కూచుని సేవచేసింది. తెల్లవారు ఝామున అయిదుగంటలకు ఆ మహాయిల్లాలు పరమపదించింది; ఆమె ఆత్మబోయి భర్త మోతీలాల్ ఆత్మలో లీనమైంది.

1939 లో ద్వితీయ మహాసంగ్రామం ఆరంభమైంది. సామ్రాజ్యవాద బ్రిటన్‌కూ, నాజీ జర్మనీకీ మధ్య జరుగు తూన్న ఈ యుద్ధంతో నిజానికి ఇండియాకేమీ సంబంధం లేదు. ఇండియా తన సహజ సంపదలను సామ్రాజ్యవాద యుద్ధ నిర్వహణకుగాను వినియోగించి తాను మాత్రం శాశ్వత దాస్యంలోనే ఉండజాలదు. అందుచేత గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహోద్యమాన్ని ఆరంభించాడు.

1940 డిశంబరు 9 తేదీన విజయలక్ష్మి వ్యక్తిసత్యా గ్రహం చేసింది. అందుకు ప్రభుత్వము వారామెను నాలుగు నెలలు నైనీ సెంట్రల్ జైల్‌లో ఉంచారు.

ఇట్లు వ్యక్తిసత్యాగ్రహం చేసే అవకాశం అందరికీ ఇవ్వ లేదు గాంధీజీ. ఆయవకాశం విజయలక్ష్మికి లభించిందంటే

గాంధీజీ దృష్టిలో ఆమె ఎంత యోగ్యురాలో మనం ఊహించుకోవచ్చు.

విజయలక్ష్మి జైలునించి తిరిగి వచ్చిన తరువాత భారత రాజకీయాలు విచిత్ర పరిణామదశలో ఉన్నాయి.

కాంగ్రెస్ మంత్రులు రాజీనామాలిచ్చి వచ్చేయటంతో రాష్ట్రాల్లో 93 వ సెక్షన్ అమలు జరిగింది. అడ్వయిజర్ల పరిపాలన నిరంకుశంగా సాగుతోంది. ఇట్టి సందర్భంలో చైనానించి ఛియాంగ్ దంపతులు ఇండియాకు వచ్చారు.

నెహ్రూ కుటుంబీకులకు, ఛియాంగ్ దంపతులకు చాల కాలంగా స్నేహం ఉంది. అనేకసార్లు విజయలక్ష్మి మేడమ్ ఛియాంగ్ - కై - షేక్‌ను ఇండియాకు రావలసినదిగా ఆహ్వానాలు పంపింది. చివరకు యుద్ధ సమయంలో ఆమె ఈ దేశం రావటం తటస్థించింది.

1942 ఫిబ్రవరి 12 తేదీన మేడమ్‌ఛియాంగ్‌కు అఖిల భారత వుమన్సు కాన్ఫరెన్సు తరఫున లేడీ ఇర్విన్ కాలేజిలో విజయలక్ష్మి స్వాగతం ఏర్పాటు చేసింది. విజయలక్ష్మి స్వాగత పత్రం చదివి సమర్పించింది.

విజయలక్ష్మిలాంటి నాయకురాండ్రు దేశభక్తి ప్రపూరితలై క్లిష్టసమయాల్లో వొళ్ళుదాచుకోకుండా దేశానికి అండగా నిలిచి, ప్రజాక్షేమానికి పాటుపడుతూన్నందుకు మేడమ్ ఛియాంగ్ తన సంతోషాన్ని వెలిబుచ్చింది. విజయలక్ష్మి వంటి నిస్వార్థపరురాండ్రను ఆమె ఈదేశంలో సందర్శించినది కనుకనే—"భారత పునర్నిర్మాణ కార్యక్రమంలో భారతవనితలు నిర్వహింపవలసిన భారం చాలా వుంది.

భారతమహిళలలో ఉజ్జ్వలమైన భారత దేశభవిష్యత్తు సూచిత మౌతున్నది”—అని ఆమె పలికింది.

*    *    *

1942లోనే ఇందిరా—ఫిరోజ్‌గాంధీల వివాహోత్సవంతో మరొకసారి ఆనందభవనం కళకళలాడింది. ఇందిర జవహర్ లాల్ నెహ్రూకూతురు. దేశమంతటా రాజకీయ తుఫాను గాలులు తీవ్రంగా వీస్తోంటే ఆనందభవనంలో విజయలక్ష్మి; జవహర్‌లాల్‌నెహ్రూ కుమారి ఇందిర వివాహం నెపంగా నాలుగురోజులు మాత్రం ఆనందంగా బంధువులందరితో హాయిగా గడిపినారు. కాని—

దేశసేవే జీవితకార్యక్రమంగా అనుష్ఠించుతూన్న వారికి విశ్రాంతి యెక్కడిది? శుష్కప్రియాలు, శూన్యహస్తాలతో క్రిప్సు రాయబారం విఫలమైపోయింది. యుద్ధం అనే నట్ట నడిసంద్రంలో వున్నా బ్రిటిష్ కన్సర్వేటివ్ తత్త్వవేత్త లలో హృదయపరివర్తనం కలుగలేదు. చివరకు 1942 ఆగస్టు 9 తేదీన గాంధీజీ ఆధ్వర్యాన కాంగ్రెస్ కార్యవర్గం ‘క్విట్ ఇండియా’ తీర్మానాన్ని ఆమోదించింది. ‘మృత్యుర్వా యశోవా’ మంత్రంజపించి నడుములుబిగించారు కాంగ్రెస్ వాదులంతా. బ్రిటిష్‌ప్రభుత్వం ముందుగానే జాగ్రతపడ దామనుకుని కాంగ్రెస్ కార్యవర్గసభ్యులందరినీ, గాంధీజీని కూడా బంధించివేసింది. దానితో ప్రజల ఆవేశం ద్విగుణీ కృతమైంది. కాంగ్రెస్ ప్రతిపాదించిన ‘క్విట్ ఇండియా’ ఉద్యమం ఒక మహావిప్లవమై, సోషలిస్టునాయకుల అద్భుత దోహదక్రియలతో అపూర్వశోభతో ప్రజ్వలించి, భారత

స్వాతంత్ర్య సమరచరిత్రలో ఒక 'సువర్ణాక్షర లిఖిత' ప్రకరణం అయింది.

ఆగస్టు తీర్మానం ఆమోదితమైన నాలుగురోజులకు — అంటే 1942 అగస్టు 12 తేదీన రాత్రి రెండుగంట లప్పుడు విజయలక్ష్మిని అరెస్టు చేయటానికి వారంటు పుచ్చుకుని పోలీసులుహాజరైనారు. ఒకరిద్దరు కాదు; అనేకమంది పోలీసులు లారీలలో వచ్చారు; వచ్చి వరండానిండా మూగారు. విజయ లక్ష్మి లేచివచ్చి చూచింది. అంతమంది కలసి అంతబందో బస్తుగా రావటంచూచి ఆమె అసహ్యించుకుంది. "నిరాయుధు రాలైన ఒకస్త్రీని అరెస్టు చేసేందుకు మీరింతమంది సాయు ధులై ప్రస్థాన భేరిభాంకృతులతో రావలెనా?" అని అడిగింది వ్యంగ్యంగా.

ఇంతలో ఆమె కూతుళ్ళకు కూడా నిద్రాభంగమైంది. వారున్నూ లేచివచ్చారు; పరిస్థితులు అర్థం చేసుకున్నారు; కాని చలించ లేదు.

చిన్నపిల్ల రీటా నిద్రాలసములైన తనవిశాల నేత్రాలు విప్పి తల్లికేసి చూస్తోంది. అప్పుడా మాతృహృదయం పొం గింది. తాను జైలుకువెళ్ళిపోయాక ఈ చంటిదాన్ని తల్లియై ఆదరించగలవా రెవరు?

"నాకుకూడా జైలుకు వెళ్ళాలనిపిస్తోంది. నువ్వు జైల్లో ఉంటే మేము బయట బ్రిటిష్‌వారితో యుద్ధంచేస్తాం లే అమ్మా!" అన్నది రీటా ముద్దుగా.

"నువ్వేమీ మనసుకు కష్టపెట్టుకోకమ్మా! ఏంఫరవా లేదు" అంటూ లేఖ తల్లికి ధైర్యంచెప్పింది.

ఆటుతరువాత పోలీసులామెను ఒకలారీలో ఎక్కించుకుని నైనీ జైలుకు తీసుకువెళ్ళారు.

"జైలు అంటే బ్రతికివున్నవాళ్ళను పూడ్చిపెట్టే ఒకగోరీ" అని ఒక ఆంగ్లరచయిత అన్నాడు. విజయలక్ష్మి 'జైలు రోజులు' అన్న పుస్తకం ఒకటిరాసింది. దాన్నిబట్టి ఆమె జైలుజీవితం చాలా దుర్భరంగా ఉండినట్లు మనకు అర్థమా తున్నది. "నరకలోకంలో ఖైదుఖానాలు ఎలా ఉంటాయో నాకు తెలియదు. కాని నేను ఆ నరకలోకం వెళ్లటం తట స్థిస్తే ఆ నరకాధిపతులకు వాళ్ళ జైళ్ళను ఎలా బాగుచేసు కోవాలో....బ్రిటిష్ ఇండియా జైళ్ళలోని నా అనుభవాన్ని బట్టి....కొన్ని సూచనలివ్వగలను" అని విజయలక్ష్మిరాసింది.

విజయలక్ష్మిని ఉంచిన జైలుఖానాలో ఏవేవో పురుగులు ప్రాకుతూ ఉండేవి. ఆమెకు రాత్రిళ్లు ఆదమరచి నిద్రపోయే అవకాశమే లేకపోయింది. దురదృష్టవశాత్తు వర్షంకురిసిం దంటే గదిఅంతా జలాజంత్రమై పోయేది. "వర్షపుదినాల్లో నాగది అంతా ఒక మహాసముద్రం. అందులో నాపరుపు పరుచుకున్నస్థలం ఒకదీవి-" అని ఆమెడైరీలో రాసుకుంది.

ఆమెకిచ్చే రేషన్ బియ్యంనిండా పెద్దపెద్ద సాలీళ్లూ అవీ ఉండేవి. మంటిబెడ్డలూ, సన్నసన్న రాళ్లూ అన్నీ ఏరి పార వేశాం. కందిపప్పు సగానికిసగం తరిగిపోయేవి. నెయ్యి పసుపు పచ్చ రంగులో ఉండేది; ఒక విచిత్రమైన దుర్గంధం వస్తూ ఉండేది. జైల్లో ఒక గుడ్డిలాంతరు మాత్రం మినుకుమినుకు మంటూ ఉండేది. ఆదీపపు వెలుగులో పడే నీడలు విజయ లక్ష్మికి దయ్యాల్లా కనిపిస్తూ ఉండేవిట. జైలు ఆవరణకు

నెలుపలస్నించి కప్పలు అస్తమానం చెవులు చిల్లులు పడేట్టు బెకబెకలాడుతూ ఉండేవి. బాగా వికృతంగా బలిసి, చూడ్డానికి అసహ్యంగా పప్పుముద్దల్లా గెంతుతూ, గొడవచేస్తూండే ఆ కప్పలను చూస్తోంటే విజయలక్ష్మికి.... 'నాకాయుష్యం, నాకారోగ్యం' అనుకుంటూ కేవలం స్వార్థపరులై, యుద్ధ కాలం అవకాశంగా అధికలాభాలు గడించి, బొర్రలుపెంచుకుని, కూపస్థమండూకాల్లాగ కాలక్షేపంచేస్తూన్న 'తిండి దొంగలు' జ్ఞాపకం వచ్చేవాళ్లు.

రాత్రివేళమాత్రం అగణిత తారకావిలసితమైన నీలాకాశాన్ని చూస్తూ విజయలక్ష్మి రవంత ఊరడిల్లేది. నక్షత్రాల మినుకుమినుకు వెలుగులలో ఆమెకు ఒక మధురశాంతి లభించేది. ఒకొక్కనాడు నాలుగైదు చంద్రకిరణాలు వెండి తీగల్లా దూసుకునివచ్చి ఆమె గదిలో కాసంత వెన్నెల చిలికేవి.

ఎప్పుడేనా ఒక విమానం బంయ్ మని రొదచేసుకుంటూ ఆకాసిమార్గాన ఎగిరిపోయేది అప్పుడు విజయలక్ష్మికి ఆయినుప చువ్వలు విరుగగొట్టుకుని జైలులోంచి తప్పించుకు పారిపోదామనిపించేది.

మహాదేవదేశాయి మరణవార్తవిని జైల్లో విజయలక్ష్మి చాలా విచారించింది. ఆమె మనస్సు ఒక్కసారిగా ఇరవై రెండు సంవత్సరాల వెనక్కు వెళ్ళిపోయింది. రంజిత్ పండిత్ వ్రాసిన వ్యాసం ఒకటి చదువుకోమని, మహాదేవదేశాయి 1920-లో తన్ను కోరినాడు తదాదిగా తనకు రంజిత్ పండిట్‌పై జనించిన అభిమానం ప్రేమగా పరిణతిచెందిది

వివాహంగా పర్యవసించింది. ఇంతకు కారణభూత్తు.... ....
ముఖ్యంగా రంజిత్ పండిట్ సహాధ్యాయి....అయిన మహాదేవ
దేశాయి మృతి విజయలక్ష్మికి అత్యంత విషాదహేతువు
కావటంలో ఆశ్చర్యం లేదు.

1942 అగస్టు 30 తేదీని విజయలక్ష్మి కూతురు లేఖ కూడా
అరెస్టు అయింది. పోలీసులా బిడ్డను తెచ్చి తల్లివున్న ఖానా
లోనే ఉంచారు. "ఈపసిపిల్ల ఈ లేతవయసులో రాజకీ
యాల్లో దిగి అవస్థ పడుతోందే" అన్న విచారం ఆమాతృ
హృదయంలో ఒకవంక రేగినా....'తనబిడ్డ తనంత వీరాంగన
కానున్న దన్న' మాతృగర్వం కూడా మరొకవంక సంధ
డించకపోలేదు. తరువాత కొన్నాళ్ళకు జవహర్‌లాల్
కూతురు ఇందిరకూడా అరెస్టుఅయి అక్కడికే కొని రాబడ్డది.

1942 సెప్టెంబరు 19 తేదీని రంజిత్ పండిట్ కూడా
అరెస్టు అయినాడు. ఆయన్నుకూడా విజయలక్ష్మివున్న
జైల్లోనే మరొక వార్డులో బంధించారు. భర్తకూడా అరెస్టు
అయినాడన్న వార్తవిని విజయలక్ష్మి చాల విచారించింది.
ఇక తారను, రీటాను ఆదరణగా చూచేదెవరు ?

రోజులు ఇలాగే విజయలక్ష్మికి అశాంతియుతంగా గడు
స్తున్నాయి. కాసేపయినాసరే రంజిత్‌ను కలుసుకుని మాటాడే
అవకాశం లభిస్తే మనశ్శాంతి చేకూరుతుందేమో నని పిం
చింది. అందుకని తరచు భార్యాభర్తలు ఒకరినొకరు చూచు
కునేందుకు 'ఇంటర్వ్యూ'ల సౌకర్యం కలుగజేయవలసినదిగా
జైలు సూపరింటెండెంటుకు ఉత్తరం రాసింది.

నవంబర్ నెలలో ఒకనాడు రీటా జైలుకు వచ్చినట్లు విజయలక్ష్మికి చూచాయగా తెలిసింది. ఇంటి వద్ద ఏమి ప్రమాదం వచ్చిందో! తన సలహా అడిగి పోదామని వచ్చింది కామాలు! విజయలక్ష్మి వెంటనే సూపరింటెండెంటు కార్యాలయానికి వెళ్ళి 'రీటా'ను చూడ్డానికి అనుమతి అడిగింది. కాని సూపరింటెండెంటు టెలిఫోన్‌లో డిస్ట్రిక్టు మేజస్ట్రేట్‌తో మాట్లాడి 'వీల్లేద'ని చెప్పేశాడు. అప్పుడామె హృదయం ఎంతగా కొట్టుకులాడిందో ఆమెకే తెలియాలి. రీటాను ఎత్తుకుని గుండె కదుముకోవాలని ఆమె యెంతో తహతహ లాడింది. తల్లిని చూడాలని గంపెడంత ఆశతో ఆ చంటిపిల్ల ఇన్నిమైళ్ళదూరం ప్రయాణంచేసి వచ్చి పాపం నిరాశతో తిరిగి పోవలసి వచ్చింది. ఆ సంగతి తలుచుకుని ఆ తల్లి గుండె కుమిలి కుమిలి పోయింది. ఔనుమరి! 'మనం తలచేది ఒకటి; భగవంతుడు—కాదు, బ్రిటిష్ ప్రభుత్వం తలచేది వేరొకటి.'

చింతామగ్నయై విజయలక్ష్మి జైల్లో ఇనుప చువ్వలు పట్టుకుని శూన్యంలోకి చూస్తూ నిల్చున్నది. ఆ సమయంలో....జైలు అధికారులు 'ఇంటర్‌వ్యూ' మంజూరు చేశారు కామాలు....రంజిత్ పండిట్ చక్కా వచ్చాడు. ఆమె నడుము చుట్టూచెయి పెనవైచి—'ఏమిటి విజయ్! అలా ఉన్నావేం? ఇంటి దగ్గరనించి దుర్వార్తయేమైనా వచ్చిందా?' అన్నాడు. భర్తృ పరామర్శ కోసం ఆమె ఎన్నాళ్ళనించో మొగం వాచి ఉంది. అతని స్పర్శతో ఇష్టు

డామె వివశురాయిపోయింది. కాని మరుక్షణంలోనే తెప్పరిల్లి, తన్నుతాను సంబాళించుకుని, విషయం చెప్పింది.

రంజిత్ పండిట్‌కు కోపం వచ్చింది. "రీటాను చూడ్డానికి నీయంతట నీవే జైలు అధికారులను అనుమతి యాచించా నంటున్నావా? ఈ చిల్లర ఉద్యోగస్థులను పోయి ఏవేవో సదు పాయాల కోసం ప్రార్థించటం అనుచితమని నీకు నేనెన్నో సార్లు చెప్పాను. అలా నువు లేనిపోని యాశలకు లోను కా రాదుసుమీ! అంతమాత్రం తెలుసుకోలేని చిన్నపిల్ల వుకాదు కదా! నేటి మన స్వాతంత్ర్య సమరంలోమనం ఇతర్ల కృపా కటాక్ష వీక్షణాలనూ, ఉపకారాలనూ ఆశించరాదు, తెలు సునా? పిరికితనం వహించకు; ధైర్యంగా ఉండు" అని హితం ఉపదేశించాడు.

భర్తతోటి 'ఇంటర్‌వ్యూ' తాను అనుకున్నట్టుగా జరుగ లేదు. తాత్కాలికంగా తన్ను ముంచుకున్న దౌర్బల్యం ఆమెకు తెలిసి వచ్చింది. సిగ్గుపడ్డది.

1943 ఫిబ్రవరిలో గాంధీజీ జైల్లోనే నిరాహారదీక్ష ఆరం భించాడు. కొందరు అరెస్టు వీరుల హింసాచర్యలకు నిష్కృ తిగా మహాత్ముడా ఉపవాసదీక్ష పూనినాడు. ఆ సందర్భంలో గాంధీజీయెడ సానుభూతి ప్రకటించు నిమిత్తం విజయలక్ష్మి, ఆమెభర్త రంజిత్ పండిట్—ఇద్దరూ ఒక్కరోజు ఉపవ సించారు.

'క్విట్ ఇండియా' ఉద్యమ సందర్భంలో అరెస్టు అయిన నాయక శిరోమణులకు చాలమందికి జైళ్ళల్లో ఆరోగ్యం

పాడైపోయింది. శ్రీ మహాదేవదేశాయి, శ్రీ కస్తూరిబా గాంధీ జైలుకే ప్రాణాలర్పించారు. విజయలక్ష్మికి కూడా జబ్బుచేసింది. అందువల్లనే 1943 జూన్ 11 తేదీన విజయ లక్ష్మిని విడుదల చేశారు. కాని ఒకపక్షం రోజులుమాత్రమే ఆమెకు విశ్రాంతి. తరువాత మళ్ళీఆమె జైల్లోవచ్చి వుండ వలసినదే.

ఆ పక్షంరోజులలో ఒకనాడు కృష్ణ ఆమెను చూడవచ్చింది. అక్కగారిని చూడగానే ఆమెగుండె ప్రీలిపోయింది. సంవ త్సరంక్రితం చూచినప్పు 'డామె పదిసంవత్సరాలు చిన్నదిగా కనిపించేది. ఇప్పు డామె పది సంవత్సరాలు ముసలిదై పోయింది. తొమ్మిది నెలల జైలుజీవితం ఆమెలొ ఎంతో మార్పు తెచ్చింది'. కృష్ణ ఒక్క వారంరోజులు అక్కగారితో ఉండి వెళ్ళిపోయింది.

జైలునుంచి విశ్రాంతి కోసమై విడుదలై వచ్చిన ఆ పది హేను రోజుల్లోకూడా విజయలక్ష్మి విశ్రాంతి యన్న మాట యెరుగదు. మహిళాభ్యుదయ కార్యక్రమంలో పాల్గొన్నది. అఖిల భారత 'వుమన్స కాన్ఫరెన్సు' వారు శిశుపోషణ కోసం నిధిని ప్రోగుచేయటాని కొక కమిటీని ఏర్పరచారు. విజయలక్ష్మి ఆ కమిటీకి అధ్యక్షురాలైంది.

పక్షం రోజుల విశ్రాంతికోసం విజయలక్ష్మి విడుదల యైననాడే 'లేఖ'ను కూడా జైలునించి విడుదల చేశారు.

తన కూతుళ్ళను అమెరికా వెలస్లీ కాలేజీలో చదువుకు పంపించ వలెనని విజయలక్ష్మి ఉద్దేశించింది. లేఖకు భారత దేశంవిడిచి పోవలెనని లేదు. కాని తమకూతుళ్ళు స్వతంత్ర

దేశంలో విద్యాభ్యాసంచేసి రావలెనని విజయలక్ష్మి రంజిత్ పండిట్‌లు వాంఛించారు. "నువ్వు అమెరికన్ కాలేజీలో చదువుకుని వచ్చాక—అమెరికాలో అనేకమందితో నీకు పరిచయంగూడా ఏర్పడుతుంది—అప్పుడు మాతృదేశానికి ఇంకా ఎక్కువగా సేవ చెయ్యగలవు" అని విజయలక్ష్మి కూతుర్ని ప్రోత్సహించింది. చివరకు ఎలాగైతేనేం లేఖ అమెరికా వెళ్ళటానికి అంగీకరించింది. లేఖతో ఆమె చెల్లెలు తారకూడా బయలు దేరింది.

ఎక్కువ కాలవిలంబం చెయ్యకండా విజయలక్ష్మి అమెరికాలోని తనమిత్రులతో కేబిల్సుద్వారా సంప్రదించి, తన కూతుళ్ళకు వెలస్లీ కాలేజిలో సీట్లు సంపాదించింది. 'మీ కూతుళ్ళను ఆహ్వానిస్తూన్నందుకు మా వెలస్లీ కాలేజి గర్విస్తూన్నది; ఆనందిస్తున్నది' అని కాలేజి అధికారుల వద్దనించి ఆమెకు కబురు వచ్చింది.

విజయలక్ష్మి తన కూతుళ్ళ ప్రయాణానికి పాస్ పోర్టులు సంపాదించింది. కూతుళ్ళను బొంబాయి రైలు ఎక్కించి విజయలక్ష్మి మళ్ళీ జైలుకు వెళ్ళిపోయింది.

1943 మే 15 తేదీని లేఖ, తార — అక్కచెల్లెళ్ళిద్దరూ ఓడయెక్కి అమెరికా వెళ్ళి పోయారు.

## అమెరికాలో భారత రాయబారి

జైలునించి విడుదలై వచ్చాక 1944 నవంబరు నెలలో విజయలక్ష్మి అమెరికాకు బయలుదేరి వెళ్ళింది. అక్కడ వెలస్లీ కాలేజిలో చదువుకుంటోన్న ఇద్దరు కూతుళ్లను చూడ

టము, మూడవ కుమార్తె చదువుకు కూడా అక్కడ యేర్పాట్లు చేయటము -- ఇవీ ఆమె ముఖ్యోద్దేశాలు.

విదేశాల్లో ఉన్నన్నినాళ్ళూ నోరు మెదల్పనని విజయలక్ష్మి దగ్గిర వాగ్దానం తీసుకునే ఇండియా ప్రభుత్వం ఆమెకు అమెరికా వెళ్ళేందుకు అనుమతి ప్రసాదించింది. కాని తీరా అమెరికా వెళ్ళిన తరువాత అక్కడ బ్రిటిష్‌వారు భారత దేశం గురించి సాగిస్తోన్న దుష్ప్రచారమంతా చూచే సరికి ఆమె ఊరుకుండలేకపోయింది. భారత దేశ నిజ పరిస్థితులను అమెరికన్ ప్రజలకు విస్పష్టంగా తెలియజేయటం తన విధి యని భావించింది.

ఇండియాలో అందరూ పాముల్ని పట్టి ఆడించేవారనీ, వాళ్ళంతా చెట్లమీదే వాసం చేస్తూంటారనీ—ఇలాంటి ప్రచారం కూడా అమెరికాలో సాగుతోంది.

పీటర్ మ్యూర్ దంపతులు 1942 లో ఇండియాకు ప్రత్యేకంగా పంపబడినారు. వారిక్కడ 15 నెలలు మన సత్తారాలు చవిచూచి, చివరకు బ్రిటిష్‌వారి ప్రచారానికి ఉపయోగించేట్టు 'This is India' అని ఒకపుస్తకం రాసి, అమెరికా వెళ్ళి ప్రచురించారు.

పోస్టు వెల్లర్ అను నతడు, మిస్ మేయో భ్రాత. బ్రిటిష్ పక్షపాతి. 'India against the Storm' అను గ్రంథాన్ని ప్రచురించి భారత వ్యతిరేక ప్రచారానికి తోడ్పడినాడు.

ఇలాగ.... స్వపరిపాలనా బాధ్యతలు నిర్వహించే స్థితిలో భారత దేశం లేదనీ—హిందూ ముస్లింల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటుందనీ—గాంధీజీ, అతని యనుచరులూ

జపాన్ పక్షపాతులనీ—కాంగ్రెస్ ఒకఫాసిస్టు సంస్థయనీ—హిందూ నిరంకుశ ప్రభుత్వాన్ని స్థాపించి ప్రజలను పీడించేందుకే కాంగ్రెస్‌వారు స్వరాజ్యం కావాలంటున్నారనీ—ఇటువంటి అబద్ధాలన్నీ బ్రిటిష్‌వారు అమెరికాలో ప్రచారం చేస్తున్నారు. అందుకోసం అమెరికాలో మొత్తం పదివేల మంది బ్రిటిష్ పక్షపాతులు ఆనిమిష వ్యగ్రులై కృషిచేస్తున్నారు. అందుకోసం బ్రిటిష్ ప్రభుత్వం సాలుకు పది పన్నెండు లక్షల డాలర్లుధనం వ్యయం చేస్తున్నది. ఈదుష్ప్రచారకులలో ముప్పయి మందికిపైగా బ్రిటిష్ తాబేదారు లనదగిన భారతీయులుకూడా ఉన్నారు. బ్రిటిష్ ప్రభుత్వం వీరికి బిరుదులిచ్చి, పీపులుదువ్వి తమ ఏజెంట్లనుగా మాలిమి చేసుకున్నది. ఇన్ని అబద్ధాలు ప్రచారం చేస్తూండటములో బ్రిటిష్‌వారి స్వార్థం ఏమిటి? భారత స్వాతంత్ర్య సమరం యెడ అమెరికనుల సానుభూతి లేకండా చేయటమే వారి ప్రధాన ఆశయం. ఇండియాలోనించి బ్రిటిష్‌వారు వైదొలగిపోతే భారతీయులు తమలో తాము కొట్లాడుకుని అల్లరిపాలై పోతారనీ—అందుచేత ఇంకా కొన్నాళ్ళపాటు బ్రిటిష్‌వారు ఇండియాపై పెత్తనం వహించవలసిన ఆవశ్యకత ఉన్నదనీ—నిజానికి భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందగల అర్హత సంపాదించేందుకే తాముకూడా అనువైన అవకాశాలు కల్పిస్తున్నామనీ—అమెరికనులను నమ్మించాలని బ్రిటిష్‌వారి ఎత్తు. అలాగ అమెరికనుల కన్నులు మప్పి ఇండియాలో తమమామూలు నాటకం ఆడుతూండాలనే వారికోరిక.

ఇటువంటి సామ్రాజ్య వాదుల కుట్రను విజయలక్ష్మి కళ్లారాచూచి సహించలేకపోయింది. అసలు భారత దేశంలో హిందూ ముస్లింలకు పోరుపులు పెడుతున్నది బ్రిటిష్ ప్రభుత్వమేననీ—బ్రిటిష్‌వారు వైదొలగి పోయిన మరుక్షణమే భారత దేశంలో అంతఃకలహాలు అంతరించి పోతాయనీ—బ్రిటన్ అమెరికాలకన్నా నాజీఫాసిష్టు తత్వాలను నిరసించినది కాంగ్రెస్ సంస్థ యేననీ—అడుగడుక్కీ బ్రిటన్ తన వాగ్దానాలను ఉపసంహరించుకుంటూ భారతీయులను విసిగిస్తోందనీ—ఇప్పటికైన భారత స్వాతంత్ర్యాన్ని అగ్రరాజ్యాలవారు గుర్తించకపోతే ప్రపంచశాంతి గగన పుష్పమేననీ—విజయలక్ష్మి అమెరికాలో వివిధప్రదేశాల సంచారంచేసి ఎలుగెత్తి చాటింది. ఆమె అమెరికాలో ఉన్నన్నినాళ్ళూ క్షణకాలంకూడా విశ్రాంతి యెరుగదు.

ఇంతలో యూరప్‌లో సంగ్రామం తమకే విజయవంతంగా పర్యవసించగలదని దృఢనమ్మకం చిక్కగానే మిత్రరాజ్యాలవారు సాన్‌ఫ్రాన్‌సిస్కోలో శాంతిసమావేశం ఆరంభించారు. ఆసమయాన విజయలక్ష్మి అమెరికాలో ఉండటం భారత దేశానికి ఎంతైనా లాభకారి అయింది.

ఫ్రిస్కో సమావేశానికి భారత దేశం తరఫున సర్ ఫిరోజ్ ఖాన్‌నూన్, సర్ రామస్వామి మొదలియార్, సర్. క్రిష్ణమాచారి ప్రభృతులు వెళ్ళారు. వీరు నిజానికి భారతప్రజా ప్రతినిధులేమీ కాదు. బ్రిటిష్‌వారు వీరిని తమ యేజెంట్లుగా ఉపయోగ పడేందుకు బిరుదులిచ్చి, తమ బంగారు పంజరంలో పెంచుకున్న రామచిలుకలు. వీరు ఫ్రిస్కో సమావే

శంలో బ్రిటిష్‌వారు చెప్పమన్న మాటలే పలుకుతారు గాని భారత ప్రజాభిప్రాయాలను ప్రతిధ్వనింపగల ధైర్యశాలు లేమీకాదు

"ఫ్రిస్కో-సభకు తగుదుమన్మా యని విచ్చేసిన ఈ భారత ప్రతినిధులనబడేవారు నిజంగా ప్రజాప్రతినిధులుకారు. భారతదేశంలోని బాధ్యతగల ఏ రాజకీయ వర్గానికీ వీరు చెందరు. బ్రిటిష్‌ప్రభుత్వం వీరిని కేవలం నియమించి పంపింది. కనుక ఫ్రిస్కో-సభలో వీరునడిపే వ్యవహారకాండతో భారత ప్రజలకేమీ సంబంధంలేదు. వారందుకు బాధ్యత వహింప జాలరు" అంటూ విజయలక్ష్మి ఒక్క ఆటంబాంబు విసిరింది. దానితో పాపం ఆభారత ప్రతినిధులు చాల చిన్న బుచ్చుకున్నారు; విజయలక్ష్మి మాటలకు జవాబేమీ చెప్ప లేదు; తమ్ము తాము సమర్థించుకోటానికేమీ ప్రయత్నించ లేదు; గమ్మున ఊరుకున్నారు; కాని లోపాయి కారీగా విజయలక్ష్మి ప్రచారానికి అడ్డంకులు కలగించటానికి ప్రయ త్నించారు.

ఒకసారి పత్రికావిలేఖరుల సమావేశంలో విజయలక్ష్మి ముచ్చటిస్తోంది. అక్కడ హాజరైన పత్రికా విలేఖరులలో ఖుర్షీద్ అహమ్మద్‌ఖాన్ అనునతడు ఒకడున్నాడు. అతడు నిజానికి పత్రికావిలేఖరికాదు; భారత ప్రతినిధులతో పాటు వచ్చిన ఒక స్టెనోగ్రాఫర్. అతడు మాటి మాటికీ ఏవేవో అర్థంలేని ప్రశ్నలన్నీవేసి విజయలక్ష్మిని విసిగించాడు. మిగిలిన పత్రికావిలేఖరులామెను ప్రశ్నించటానికే అవకాశ మివ్వాడుకాదు. ఈవిధంగా భారతదేశ యదార్థపరిస్థితులను

విజయలక్ష్మి పత్రికావిలేఖరులకు తెలియజెప్పే అవకాశమే ఇచ్చాడుకాదు. మిగతా పత్రికా విలేఖరు లందరికీ అసహ్యం వేసింది. చివరకా పెద్దమనిషి ప్రత్యేకంగా దురుద్దేశంతో సర్ ఫిరోజ్‌ఖాన్‌నూన్‌చే ప్రేషితుడని తెలిసిపోయింది. కాగా అది ఫిరోజ్‌ఖాన్‌నూన్‌కే అపకీర్తి అయింది. విజయ లక్ష్మికి మరింత ప్రచారంవచ్చింది.

సర్ ఫిరోజ్‌ఖాన్‌నూన్ ప్రభృతులు నిజంగా భారత ప్రజాప్రతినిధులు కాకపోవటంచేత విజయలక్ష్మి ఫ్రిస్కో-సభకు ఒక మెమోరాండమ్‌ను పంపించింది. అమెరికాలోని భార తీయులసంఘం, ఇండియా లీగువారు (భారతస్వాతంత్ర్యాన్ని కోరే అమెరికనులు) ప్రోత్సహించగా ఆమె భారతజాతీయ కాంగ్రెస్ సభ్యురాలుగా ఆ మెమొరాండమ్‌ను ఫ్రిస్కోసమా వేశంలోని మిత్రరాజ్య ప్రతినిధులకు అందజేసింది.

తక్షణమే ఇండియాను స్వతంత్ర దేశంగా ప్రకటించవలె నని ఆమె అందులో తెలియజేసింది. ఇండియా బానిసదేశంగా ఉండగా ఆదేశ ప్రతినిధులను ఫ్రిస్కో-సమావేశానికి రప్పిం చటం ఇండియాను అవమానించినట్లు. ఎందువల్లనంటే— సంయుక్తరాజ్య సమావేశంలో స్వతంత్ర దేశాల ప్రతినిధులే పాల్గొనవలెనన్న నిబంధనఉన్నది.

విజయలక్ష్మి ఆ మెమొరాండమ్‌ను ఒక్క ఇండియా తరఫునేకాదు, పశ్చిమీయ సామ్రాజ్యవాదులనుంచి విముక్తి కోరుతూన్న బర్మా—మలయా—ఇండోచీనా—డచ్ ఇండీస్ మొదలైన ప్రదేశాల తరఫునకూడ విజయలక్ష్మి

ఆ మెమోరాండమ్‌లో వాదించింది. మెమోరాండంలో ఆమె ఇంకా ఇలా వ్రాసింది.

"ఇండియాలో ఈనాడు నలభై కోట్లమంది ప్రజలున్నారు. వారంతా వివిధ మతాలకు చెందినవారే; వివిధ భాషలు మాటాడుతూన్నవారే. అయినా భూగోళికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా భారతదేశంలో ఐక్యత ఉంది: అదీగాక ఇండియా పురాతన నాగరత గల దేశం; శతాబ్దాల తరబడి ఒకసాంస్కృతిక కేంద్రంగా ప్రఖ్యాతి గన్నది.

"అయినా భారతదేశం బ్రిటిష్‌వారి యాజమాన్యంలో ఉండవలసి వచ్చింది ఈనాడు. బ్రిటిష్‌వారి దయాదాక్షిణ్యాల ఫలితంగా ఈ సమావేశంలో ప్రాతినిధ్యం లభించింది ఇండియాకు. కాని భారతదేశంలో జాతీయ ప్రభుత్వం లేదు; జాతీయ జండా ఎగరటానికి వీల్లేదు; అంతర్జాతీయ సమావేశాల్లో భారత జాతీయ ప్రతినిధులు పాల్గొనే యోగ్యత లేదు; బ్రిటిష్ పాలకులే తమ యిష్టం వచ్చిన వారిని, తమకు నచ్చిన వారిని నియమిస్తూ ఉంటారు.

"నైతికంగా, రాజకీయంగా ఇట్టి పరిస్థితులు ఇండియాకు అపాయకరములు. ఈ పరిస్థితులు ఇలాగే సాగనిచ్చేట్టయితే ప్రపంచంలో అయిదోవంతు ప్రజల (భారతీయులు) గౌరవము, స్వేచ్ఛ, శాంతి, అభ్యుదయము దెబ్బతింటాయి. అలాసాగనివ్వటము సంయుక్త రాజ్య సమితి ఆశయాలకు పూర్తిగా విరుద్ధము. నూతన ప్రపంచ వ్యవస్థ నిర్మిస్తామంటున్నారు గదామరి!"

"మాల్‌టాన్ అన్నాడు— 'ఎప్పటికైనా, స్వతంత్ర భారత ప్రాతినిధ్యం ఐక్యరాజ్య పరిషత్తులో చూడ గలుగుతాము గాక!' అని. ఆ చూడ దలచినది ఇప్పుడే ఎందుకు చూడ కూడ దంటాను. భారత ప్రజా సంస్థయైన మా జాతీయ కాంగ్రెసు సర్వదా నాజీ-ఫాసిస్టు-సామ్రాజ్య తత్వాలను నిరసిస్తూనే వచ్చింది. నాజీ ఫాసిస్టు తత్వాలు ఈ యుద్ధంలో పడిపోయాయి. ఇకపోతే సామ్రాజ్యవాదం ఒక్కటే మిగిలివుంది. ఒకదేశం మరొక దేశాన్ని ఆక్రమించటం, పీడించటం, దోచెయ్యటం—ఇదే ఆ సామ్రాజ్య తత్వం యొక్క లక్షణం. అటువంటి సామ్రాజ్య తత్వాన్ని మీరు ఇప్పుడు ప్రతిఘటించి నిర్మూలించవలసి యున్నది. అందుకుగాను తక్షణమే ఇండియాను స్వతంత్ర దేశంగా ప్రకటించండి.

"బ్రిటిష్‌వారి పన్నాగం మూలాన భారత జాతీయ ప్రతినిధు లీసమావేశానికి రాలేకపోయారు. కనుక నా దేశం తరఫున నేనిప్పుడీమాటలు మీకు వినిపించవలసి వచ్చింది. అంతేగాదు—పరపాలకుల మడమల క్రింద నలుగుడు బడుతోన్న ఇంకా ఇతరదేశాల తరఫునకూడా నేనిప్పుడు మాటాడ సాహసిస్తున్నాను. భారతదేశం వలెనే జాతీయ స్వాతంత్ర్యం కోసం తహతహ లాడుతూన్న — భారత దేశంతో అనాదిగా చారిత్రాత్మక—సాంస్కృతిక సన్నిహిత బాంధవ్యం కలిగివున్న—బర్మా, మలయా, ఇండోచైనా, డచ్ ఇండీస్ రాజ్యాల తరఫునకూడా నేనిప్పుడు మాటాడుతున్నాను. వాటికిప్పుడు జపాన్‌నించి విముక్తి లభించిందని

చెప్పినంత మాత్రాన ఒరిగేదేమీ లేదు. సామ్రాజ్యవాదుల బారినించికూడా వాటికి విముక్తి లభించేట్టు చూడడం ఈ ఫ్రిస్కో-సమావేశపు బాధ్యతయై యున్నది.

బానిసత్వంలో మ్రగ్గిపోతూన్న సుమారు అరవైకోట్ల మంది ఆసియాప్రజలవాక్కు మీ కీసమావేశంలో వినిపించే అవకాశాలు లేవు. స్వాతంత్ర్యం తమ జన్మహక్కని గుర్తించలేని ఏ ఉద్యోగస్థులాలసులో వారితరఫున అవాకులు, చవాకులు పలికి వెళ్ళిపోతారు. కాని ఆ అరవైకోట్ల మంది ప్రజలకు న్యాయం జరగనంతకాలం ప్రపంచంలో నిజమైన శాంతి నెలకొనజాలదు. కనుక ఈ క్షణమే భారతదేశం స్వతంత్రదేశమని మీరు ప్రకటించేట్టయితే— ఒక నూతన ప్రపంచవ్యవస్థా నిర్మాణానికి పూనుకుని ఇప్పుడీ ఫ్రిస్కోలో సమావేశమైన సమస్త సంయుక్తరాజ్యాలవారి చిత్తశుద్ధి ప్రపంచానికి వెల్లడికాగలదు."

విజయలక్ష్మి జారీచేసిన యీ మెమొరాండమ్ చాల సమంజసంగాఉంది. అయితేనేం? సమావేశంలోని గాజి కీయజ్ఞులు దాన్ని లెక్కచేయలేదు. భారతస్వాతంత్ర్యసమస్య ఫ్రిస్కో-సమావేశ చర్చనీయాంశములలో గ్రాహ్యముకాలేదు. కాకపోవుగాక! విజయలక్ష్మి ఆసమయాన అమెరికాలో వున్నందుకు తనవిధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించింది. భారత ప్రజల కృతజ్ఞతకు పాత్రురాలు!

ఫ్రిస్కో-సమావేశానికి ఒక మెమొరాండమ్ జారీచేయటంతో మాత్రమే అమెరికాలో విజయలక్ష్మి కృషి అంత మొందలేదు. ఆమె దేశమంతా సంచారంచేసింది; అనేక

ఉపన్యాసాలిచ్చింది. అనేకమంది ప్రముఖ వ్యక్తులను కలుసు కున్నది; భారత దేశ నిజపరిస్థితులను మూలమూలల చాటింది; భారత స్వాతంత్ర్యోద్యమం యెడల అమెరికన్ ప్రజల సానుభూతిని సంపాదించింది.

"బ్రిటిష్‌వారు అధికారం వొదులుకునివెళ్ళితే స్వతంత్ర భారతస్వరూపం ఎలావుంటుంది ?"—అని ఒక అమెరికన్ పౌరు డామెను ప్రశ్నించాడు.

"స్వతంత్ర భారతంలో ప్రజారాజ్యం నెలకుంటుంది. మీ రూజ్‌వెల్టుసభాపతి నిర్వచించిన చతుర్విధ స్వాతం త్ర్యాలను అనుభవిస్తూ ప్రజలుహాయిగా ఉంటారు. ప్రపంచ శాంతి భద్రతలస్థాపనకోసం....స్వాతంత్ర్యాన్ని ప్రేమించే అన్ని జాతులతోనూ హృదయపూర్వకంగా సహకరిస్తుంది స్వతంత్రభారత దేశం" అని విజయలక్ష్మి జవాబుచెప్పింది.

ఫ్రిస్కో-సభకు వెళ్ళిన భారతప్రతినిధులొక హోటల్‌లో బసచేశారు. విజయలక్ష్మికూడా కొన్నాళ్ళు ఆహోటల్‌లోనే ఉంది. అప్పుడొకనాడు సర్ ఫిరోజ్ ఖాన్‌నూన్ ఆమెను 'టీ'కి ఆహ్వానించాడు. "మనిద్దరమూ పరస్పర వ్యతిరేక కార్యక్రమాలతో అమెరికావచ్చాం; కాబట్టి నీఆతిథ్యం నాకక్కర్లేదు" అంటూ విజయలక్ష్మి ఆహ్వానాన్ని నిరాక రించింది. సర్ ఫిరోజ్‌ఖాన్‌నూన్ కేవలం బ్రిటిష్‌ఏజంటుగా మాత్రమే ఫ్రిస్కో-సభకు వచ్చాడనీ, తానేనిజమైన భారత ప్రతినిధియనీ ఆమాటలోని గూఢార్థం. ఇలాంటి కారణం పురస్కరించుకునే రాయబారిగా వచ్చి శ్రీకృష్ణుడు 'మహా భారతం'లో దుర్యోధనునియింట భోజనంచెయ్యలేదు.

అమెరికాలో ఉన్నన్నినాళ్ళూ విజయలక్ష్మికి విశ్రాంతి కావాలన్నా దొరికిందికాదు. ఉదయం ఎనిమిదింటికల్లా ఏపత్రికా విలేఖరో వచ్చి నిద్రలేపేవాడు. ఆమె ఆదరా బాదరా లేచి ముఖంకడుక్కుని కాఫీ అదీ తాగివచ్చి అతనితో మాటాడిపంపించేది. ఇంతలో టపావచ్చేది. ఉత్తరాలు చదువుకుని, వార్తా పత్రిక లోకసారి గబగబా తిరుగవేస్తుంది. ఎవరెవరో అనేకమంది భారత జాతీయోద్యమం గురించి ఏవేవో వివరాలడుగుతూ ఉత్తరాలు రాసేవారు. టపా చూచుకున్నతరువాత టాయిలెట్ చేసుకుని విజయలక్ష్మి 'ఇంటర్వ్యూ'లకు సిద్ధంగా ఉండేది.

ఎవరో ఆమెతో ముఖాముఖి పరిచయం లేనివాళ్ళు కూడా....ఆమెనుగురించి పత్రికల్లో చదివిగాని, ఆమె ఉపన్యాసాలు వినిగాని అభిమానం జనించి పండ్లు, ఫలాలు, పువ్వులు ఇంటికి పంపిస్తూ ఉండేవారు.

ఫ్రిస్కో-సమావేశ మప్పుడు మొత్తం రెండువేలమందికి పైగా పత్రికా రచయితలు పట్నంలో హడావిడిగా తిరుగుతూండేవారు. వారిలో వంద్గలమంది విజయలక్ష్మితో సంభాషించగలిగినారు. ఒక్కొక్కనికి పదిహేనునిమిషాల చొప్పున విజయలక్ష్మి వారందరికీ అవకాశ మిచ్చింది.

మధ్యాహ్న భోజనం అయాక విజయలక్ష్మి పట్నం చూడ్డానికి వెళ్ళేది. అలా వెడుతూన్నప్పుడు పిన్నలు, పెద్దలు ఆమెచుట్టూమూగి తమనోటుపుస్తకాల్లో ఆమెచేత సంతకం చేయించుకుని సంతసించేవారు. • ఆమె అక్కడ ఉన్నన్ని నాళ్ళూ పురజను లందర్నీ తనకేసి ఆకర్షించుకో గలిగింది.

సాయంత్రమప్పు డామె డిన్నర్ పార్టీలకో, రేడియో ఉపన్యాసానికో వెళ్ళేది. ఆమె రేడియో ఉపన్యాసాలను, తదితర ఉపన్యాసలనూ 'Voice of India' పత్రికాధిపతి డాక్టర్ అనూపసింగ్ ఏర్పాటుచేస్తూ ఉండేవాడు. అతని పట్టుదల, ప్రయత్నం వల్లనే కాలిఫోర్నియా అసెంబ్లీలో కూడా విజయలక్ష్మి ఉపన్యాసం ఏర్పాటైంది.

ఇంతకు ముందెన్నడూ కాలిఫోర్నియా అసెంబ్లీకి ఆహూతుడై, అక్కడ ఉపన్యసించగల గౌరవాన్ని చూరగొన్న విదేశీయుడెవడూ లేడు. ఆ మహత్ గౌరవం మన విజయలక్ష్మికే దక్కింది.

కాలిఫోర్నియా అసెంబ్లీ సభ్యులు తమబడ్జట్ డిబేట్‌ను కూడా వాయిదా వేసుకుని విజయలక్ష్మి ఉపన్యాసానికి ఏర్పాట్లు చేశారు. స్వాతంత్ర్యం అవిభాజ్యమని చెబుతూ ఆమె ఇలా ఉపన్యసించింది:

"ఏ సమస్యా దానంతట అదే పరిష్కారం అవదు. కొన్ని సిద్ధాంతాలను విశ్వశించకండానే మనం ఎంత ప్రయత్నించినా ప్రపంచశాంతి భద్రతలను స్థాపించు విషయమై ఒక పరిష్కారమార్గానికి రాజాలము.

"ప్రపంచంలో అన్నిజాతుల సహాయ సహకారాలు ప్రపంచ పునర్నిర్మాణానికి అవసరం. వివిధ జాతులమధ్య వ్యాపార - పారిశ్రామిక - సాంస్కృతిక బాంధవ్యాలు పెంపొందగల ఒక నూతనప్రపంచాన్ని నిర్మించవలసియున్నది.

"స్నేహపూర్వకంగా అన్ని దేశాలూ ఒకదానిపై ఒకటి పరస్పరము ఆధారపడి మనగలుగుటకు దేశాలన్నీ స్వతంత్ర

ములై వుండటము అవసరం. నిజానికి ఈనాడు భారత దేశమే గనుక స్వతంత్రమైవున్నట్టయితే.... ఫ్రిస్కో-సమావేశ ప్రధానోద్దేశమైన ప్రపంచశాంతి భద్రతాస్థాపనకు ఎంతో గొప్పగా తోడ్పడేది.

"ప్రజలందరూ గౌరవంగా, హాయిగా బ్రతుకగల క్రొత్త ప్రపంచాన్ని నిర్మించేందుకు గాను ఇతరదేశాలతో పాటు ఇండియాకూడా కృషి చేస్తుంది. ప్రపంచ ప్రజలలో ఎక్కడ ఏవర్గం వారికైనాసరే న్యాయంజరుగని పక్షంలో ఈశాంతి సమావేశాలన్నీ భగ్నంకాక తప్పదు; చిరశాంతి భద్రతలు కూడా అసంభవములే ఔతాయి.

"ఎవరికివారు ప్రత్యేకంగా అధికార ప్రాబల్యాలకోసం ప్రాకులాడుతూ వుంటే లభించగల గొప్పఫలిత మేమీ ఉండదు. న్యాయము, అన్నిజాతులవారి స్వాతంత్ర్యాన్ని గుర్తించుట—ఇవి నూత్నప్రపంచ వ్యవస్థా నిర్మాణానికి ఆధారశిలలుగా ఉండాలి. అలాగైతే ఇకముందెన్నడూ పరస్పరం పోరవులు ఉప్పతిల్లవు. ప్రపంచ ప్రజలందరూ ప్రపంచసౌభాగ్యం కోసమై పాటుపడతారు.

"అన్ని జాతులవారి స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తున్నామని చెప్పినంత మాత్రాన సరిపోదు. ఆ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టాలి. మీ అమెరికన్‌లు కూడా ఒకప్పుడు ఎంతగానో తహతహ లాడినారు. ఇప్పుడు బానిసత్వంలో మ్రగ్గుతూన్న వారికి స్వాతంత్ర్యం ఎంత ప్రియతమమైన వస్తువో.... దాన్ని అనుభవిస్తూన్న మీరు గుర్తించవలె.

"భారతీయులు బ్రిటిష్‌వారి గుణగణాలను అవశ్యం శ్లాఘి స్తారు. బ్రిటిష్ సామ్రాజ్య తత్వాన్ని మాత్రమే వారు ప్రతి ఘటిస్తున్నారు. వలసరాజ్యాలకు సామ్రాజ్యవాదుల పీడ వొదిలినప్పుడే ప్రపంచంలో శాంతి.

"కనుక వివిధ జాతుల మధ్య శాంతి, మర్యాద, న్యాయము కోరేవారి కృషి ఫలితంగా నూత్న ప్రపంచ వ్యవస్థ నిర్మితం కాగలదనే ఆశిస్తున్నాను. ఆందులో అమెరికా ప్రముఖ బాధ్యత నిర్వహించగలదని నా విశ్వాసం........"

సభికులంతా నిశ్శబ్దంగా ఆమె ఉపన్యాసం విన్నారు.

తరువాత విజయలక్ష్మి బాల్టిమోర్ వెళ్ళి అక్కడ ఒక ఉపన్యాసం ఇచ్చింది. సిటీమేయర్ స్వయంగా వచ్చి స్టేషన్ వద్ద ఆమెకు స్వాగతం ఇచ్చాడు. 'పట్టణపు తాళపుచేతులు' ఆమె కిచ్చాడు. ఈ గౌరవము ప్రపంచ విఖ్యాతి వ్యక్తులకు దక్క ఇతర్లకు లభించదు.

ఆమె ఉపన్యాసాన్ని వినవచ్చిన వారిలో నీగ్రోలు, భారతీయులు, చైనీయులు, జపానీయులు, ఆమెరికన్‌లు ఉన్నారు. 'అన్ని జాతుల సమాన ప్రతిపత్తిని ఇండియా గుర్తి స్తున్నది. అమెరికన్ నీగ్రోలయెడ భారతీయులకు అమితమైన సానుభూతి కలదు' అని ఆమె చాలసేపు మాటాడింది. సంద ర్భానుసారంగా భారత రాజకీయాలను కూడా ఆమె ప్రసంగించింది.

"విజయలక్ష్మి బాల్టిమోర్ ఉపన్యాసం అమెరికాలోని నీగ్రోలయెడ శ్వేతజాతుల వారికి ప్రేమాభిమానాలు కలిగిం చునదిగా ఉంది" అని 'ట్రిబ్యూన్' పత్రిక వ్రాసింది.

స్టాక్టన్‌లో సిక్కుల దేవాలయం ఒకటి ఉన్నది. అది చాల అందమైన కట్టడం. చాల వైభవంగా కూడా ఉంటుంది. ఆ చుట్టు ప్రక్కల అనేక మంది సిక్కులు కాపురం ఉంటున్నారు.

ఒకసారి విజయలక్ష్మి ఆ దేవాలయంలో ఉపన్యాసం ఇచ్చింది. అయిదు వేల మందికి పైగా సిక్కులు హాజరైనారు. "భారతీయులు కేవలం తమ స్వాతంత్ర్యం కోసమే కాదు, ప్రపంచంలోని అన్ని బానిస దేశాల స్వాతంత్ర్యం కోసమూ ఆందోళన చేస్తున్నారు. సాన్‌ఫ్రాన్సిస్కోలో నలుగు రైదు గురు పెద్దలు కూచుని స్థిరశాంతి భద్రతలను స్థాపించలేరు. ప్రపంచ ప్రజలతో సంప్రదించకుండా వారొక్కరే ప్రపంచ భవితవ్యాన్ని నిర్ణయించలేరు. వివిధ ప్రపంచ జాతులకు ప్రత్యేక స్వాతంత్ర్యం లేకుండా ప్రపంచంలో సమిష్టి శాంతి ఉండనేరదు. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం కొన్ని తప్పులు చేశాం. తత్ఫలితంగా చాల అవస్థలు పడ్డాం; బాధలు అనుభవించాం. మళ్ళీ ఈ ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరంకూడా అనే తప్పులు చేయకుందుము గాక! భారత దేశ స్వాతంత్ర్యమే ప్రపంచ శాంతి భద్రత లకు ఆధారశిల. ఫాసిజం ఓడిపోయిందని ఈనాడు సంతోషి స్తున్నాం. కాని ఈ ఫాసిజం తాత—సామ్రాజ్య తత్వం ఉంది; దాన్ని గురించి ఆలోచించటంలేదు మనం. ఆ సామ్రాజ్యతత్వం కూడా నిర్మూలమైతే తప్ప.... ఎన్ని ఫ్రిస్కో-సమావేశాలైనా జరపండి.... ప్రపంచ శాంతి నెల కొనద్దు. నిజమైన ప్రజాస్వామిక సిద్ధాంతాలు ప్రాతిపదికలుగా

శాంతిని స్థాపించుకోవాలి. లేదా ఈనాటి మిత్రరాజ్యాల వారు రేపు శత్రువులు కాకతప్పదు"—ఈవిధమైన ధోరణిలో విజయలక్ష్మి చాలసేపు ఉపన్యసించింది.

ఒకసారి విజయలక్ష్మి రేడియో ఉపన్యాసం ఇస్తూ ఇలా చెప్పింది :

"ఆటంబాంబుకన్నా భయంకరమైన సామ్రాజ్యవాదం ఈనాడు ప్రపంచాన్ని శోషిస్తోంది. అమెరికా ఆసియాలో నాయకత్వం వహించగల స్థితిలో ఉన్నది నేడు. అట్టి నైతిక బాధ్యతను అమెరికా సహృదయంతో న్యాయంగా నిర్వహించవలసి ఉన్నది. ఈమూలనించి ఆమూలవరకూ ఆసియా ఖండం యావత్తూ సామ్రాజ్యవాదుల దురాక్రమణను, దోపిడి విధానాన్నీ అసహ్యించుకుంటోంది; ధిక్కరిస్తోంది. కాని బ్రిటిష్-ఫ్రెంచి-డచ్-జాతీయులు శాశ్వతంగా ఆశియా ప్రజలను తమ బానిసలుగా ఉంచుకోవాలనే ప్రయత్నిస్తున్నారు.

"ఇండొనీసియా, ఇండోచైనా, ఇండియా, బర్మా, ఇరాన్, పాలస్తీనా, ఈజిప్టు దేశాల జాతీయోద్యమాలలోని అంతశ్శక్తులను పశుబలంతో ఇంకా ఎన్నాళ్ళో అణచిపెట్టి వుండలేరు. ఆసియాలో వివిధజాతుల వారికి స్వాతంత్ర్యం లభించేంతవరకూ శాంతి ఉండదు.

"భారతదేశ స్వాతంత్ర్యమే ప్రపంచ సమస్యను పరిష్కరించగలదు. స్వతంత్ర భారతదేశం ఆసియాఖండానికి ఎంతో మేలు చేకూర్చగలదు. భారతావనికి దాస్యవిముక్తి కలిగిననాడు పసిఫిక్ ప్రాంత సమస్యలన్నీ పరిష్కృతములై సా

యన్నమాటే. ఇండియాలో అసంతృప్తి ప్రబలుతూఉన్నన్ని నాళ్ళూ ఆసియాఖండమంతా అశాంతియుతంగానే ఉండక తప్పదు. మానవహక్కులు గుర్తింపబడనంతవరకూ చిర శాంతి దుర్లభమే. కనుక పర పరిపాలనలో ఉన్న దేశాలన్నిటికీ స్వాతంత్ర్యం ప్రసాదించటమే శాంతికాముకులు ప్రప్రథమంగా చేయవలసినపని. శుష్కప్రియాలవల్ల పని జరగదు. 'అందరికీ స్వాతంత్ర్యం చేకూరవలెననే మేము కాంక్షిస్తున్నాం' అంటూ మాటల్లో మాత్రమే ఉదారాశయాలు ప్రకటించినంత మాత్రాన లాభం లేదు. ఏమైనా పనిచేసి చూపించాలి. అట్టిపని ఆవగింజంతైనా సంయుక్త రాజ్యాలవారు తలపెట్టనేలేదు. దుర్బలదేశాలకేవో రక్షణలిస్తున్నామని చెబుతూ, పెద్దరాజ్యాలవారు తమతమ ప్రత్యేక అధికార ప్రాబల్యాలను పెంపుజేసుకోవటమే యుద్ధానంతర వ్యవస్థా నిర్మాణమౌతుందా? అట్టి ప్రయత్నాలు ఫలిస్తాయా? నాగరకత ఒక్క తెల్లవాని సొత్తే కాదు. ఆఫ్రికా-ఆసియాల ప్రాచీన నాగరకత, పురాతన విజ్ఞానం ప్రపంచానికి కొంత సందేశం ఇవ్వజాలియున్నవి. "యూరప్ అమెరికాలే కాదు ప్రపంచానికంతకూ మార్గదర్శకములు...."

మొత్తంమీద విజయలక్ష్మి అమెరికాలో 14 నెలలు ఉంది. అమెరికా అధ్యక్షుడు ట్రూమన్‌ను, అతని భార్యను కలుసుకున్నది. ఈజిప్టు-ఇరాక్-సాదీ అరేబియా దేశాలనించి వచ్చిన విదేశాంగ మంత్రులనుకూడా కలుసుకుని సంభాషించింది. ఇంతకూ అమెరికాలో ఆమె ఇంత తీవ్రంగా భారతదేశం తరఫున ప్రచారం చేసినది మన స్వాతంత్ర్య

సంపాదనకు అమెరికనుల సహాయాన్ని అర్థించేందుకేమీ కాదు. భారతీయులు తమ స్వాతంత్ర్యాన్ని తామే ఆర్జించుకో గలరు. బ్రిటిష్‌వారి దుష్ప్రచారాన్ని ప్రపంచానికి తెలుపు టకు భారత దేశ స్వాతంత్ర్యము ప్రపంచశాంతి భద్రతలకు మూలకందము కాగలదని అగ్రరాజ్యాలవారికి హితోప దేశము చేయుటకూ విజయలక్ష్మి ప్రయత్నించింది.

ఆమె తిరిగి 1946 జనవరిలో స్వదేశానికి వచ్చింది. కృతజ్ఞతాపూర్ణులై ప్రజలామెను ఉచితరీతిని గౌరవించు కున్నారు.

## ఐక్యరాజ్య పరిషత్తులో విజయలక్ష్మి విజయం

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం ధర్మకర్తృత్వ (మాండేటరీ) విధానం అంటూ ఒకటి బయలుదేరింది. దాన్ని సృష్టించినవాడు ఫీల్డు మార్షల్ స్మట్సు. ఈ విధా నాన్ని అనుసరించి రాజకీయంగా వెనుకబడియున్న చిన్నచిన్న రాజ్యాలు ఒక అగ్రరాజ్య సంరక్షణలో కొంతకాలం— స్వపరిపాలనా బాధ్యతలు నిర్వహించుకోగల సామర్థ్యం అలవడేంత వరకూ ఉండాలి. కాని ఈ ధర్మకర్తృత్వపు మేలి ముసుగులో సామ్రాజ్యవాదులు తమ వలసరాజ్యాల సంప దను దోచుకుంటున్నారు. శతాబ్దాలు గడిచినా ఈ వలస రాజ్యాలకు స్వాతంత్ర్యం లభించగల చిహ్నాలేమీ కనిపిం చటం లేదు.

దక్షిణాఫ్రికా యూనియన్ బ్రిటిష్‌వలసరాజ్యం. అక్కడ మన భారతీయులు చాలమంది ఉన్నారు. కాని తెల్ల జాతుల వారు వారిని—ఇంకా ఇతర నల్లజాతుల వారినికూడా చాల ద్వేషభావంతో చూస్తున్నారు. ఒకప్పుడు గాంధిజీ కూడా అక్కడ కొన్నాళ్ళు తిష్ఠవేసి, సత్యాగ్రహ ఆయుధం పుచ్చుకుని దక్షిణాఫ్రిగా ప్రభుత్వంతో యుద్ధంచేసి అక్కడి భారతీయులకు కొన్ని సౌకర్యాలు కూర్చిపెట్టి వచ్చాడు. కాని తెల్ల జాతులవారి అహంభావం నానాటికీ పెచ్చుపెరిగిపోయి అనేక నిషేధపు చట్టముల రూపంలో ద్యోతకమైంది. దక్షిణాఫ్రికాలోని తెల్లజాతుల వారికి ఉండేందుకు ఇళ్ళుకట్టి పెట్టినవాళ్ళు భారత కార్మికులు; కర్మాగారాలలో చెమటోడ్చి పనిచేసి పరిశ్రమలను వృద్ధిచేసినది భారతీయులు. అయితేయేం? రవంత కృతజ్ఞతాభావమైనా లేకండా దక్షిణాఫ్రికా ప్రభుత్వ ప్రధాని జనరల్ స్మట్సు 'మాలపల్లి' చట్టాన్ని (Ghetto Act) ప్రవేశపెట్టాడు. తెల్లవాళ్ళు ఉండే పేటలలో భారతీయులు ఇళ్ళు కట్టుకోటానికి వీల్లేదు; సొంత ఆస్తిపాస్తులు కూడా ఆర్జించుకోటానికి వీల్లేదు. ఇలాగే నల్లవారిపై చాల నిషేధాలు అమలుపరచటమైంది.

దక్షిణాఫ్రికాలోని తోడిభారతీయులు ఇలా ప్రభుత్వపు ఆంక్షలకు గురియై బాధపడుతోంటే భారతదేశం చూస్తూ ఊరుకోలేకపోయింది; 'మాలపల్లి' బిల్లును తీవ్రంగా నిరసించింది; హైకమిషనరును ఇంటికి పిలిపించి వేసుకుంది; దక్షిణాఫ్రికా ప్రభుత్వంతో వర్తక సంబంధాలన్నీ త్రెంచివేసుకుంది. స్మట్సు ఏమాత్రం బెదరలేదు. భారతీయుల విజ్ఞ

ప్తులను గాని, బెదిరింపులను గాని లెక్క-చేయనే లేదు. దక్షిణాఫ్రికా భారతీయులు గత్యంతరం లేక సత్యాగ్రహ సమరాన్ని ఆరంభించారు. ఈ అహింసా యోధులను కూడా తెల్లవారు అనేక విధాలుగా హింసించారు. దానితో దక్షిణాఫ్రికా భారతీయుల సమస్య యావత్ప్రపంచాన్నీ ఆకర్షించింది. భారత దేశం స్మట్సు అత్యాచారాలను గురించి ఐక్యరాజ్య పరిషత్తుకు (U. N. O) ఫిర్యాదు చేసింది.

ఈ విషయమై చర్చించుటకు ఐక్యరాజ్యపరిషత్తు 1946 నవంబరులో సమావేశమైంది. విజయలక్ష్మి ఆధిపత్యాన భారతప్రతినిధివర్గం పరిషత్సమావేశంలో హాజరయేందుకు అమెరికా వెళ్ళింది. నెలరోజులకు పైగా సాగినాయి చర్చలు తీవ్రంగా.

అమెరికాకు బైలుదేరి వెళ్ళేముందు గాంధిజీ విజయలక్ష్మిని ఆశీర్వదించి ఇలా అన్నాడు— "నీకు ఐక్యరాజ్య పరిషత్తులో విజయం లభించినాసరే, లభించకపోయినాసరే, స్మట్సుతో మైత్రిమాత్రం సంపాదించి రావాలి సుమీ!"

అంటే—ఇండియా దక్షిణాఫ్రికాల సమస్య స్నేహపూర్వకమైన వాతావరణంలో పరిష్కారం కావలెనని గాంధిజీ ఉద్దేశం. నిజానికి నల్ల తెల్ల జాతులమధ్య సుహృద్భావం పెంపొందవలెనన్న ఆశయాన్ని సాధించటమే కదా విజయలక్ష్మి ఐక్యరాజ్య పరిషత్తుకు వెళ్ళటంలో గల ఆంతర్యం. కనుక ఆమె అమెరికాలో గాంధిజీ సలహా ననుసరించియే ప్రవర్తించింది. పలుసార్లు స్మట్సుతో కలుసుకుని మాటాడింది కూడా.

యథార్థం ఆలోచిస్తే తెల్ల నల్ల జాతుల పరస్పర సహాయ సహకారాలు లేనిదే ప్రపంచంలో శాంతిఅనేది వుండనేరదు. 'నల్లజాతులవారిపై అధికారం చలాయించేందుకే భగవంతుడు మమ్మల్ని సృష్టించాడ'ని తెల్లవారు అహంభావ పూరితులై వుంటే ఏనాటికైనా నల్ల జాతులన్నీ ఒక్కసారి ఉవ్వెత్తున లేచి తీరుతాయి. ఆసియా యూరప్‌లమధ్య ఇదివర కెన్నడూ కనివిని యెరుగని మహాప్రళయం ముంచుకువస్తుంది. కనుకనే ఐక్యరాజ్య పరిషత్తు జనరల్ అసెంబ్లీలో విజయ లక్ష్మి ఖండితంగా చెప్పింది: "ఇప్పటికి ఆఫ్రికాలో మూడు వందలమందికిపైగా సత్యాగ్రహులు నిర్బంధితులైనారు. ఇలాగే పరిస్థితులు సాగిపోనిచ్చారంటే ముమ్ముందు తీవ్రతరములైన పరిస్థితు లేర్పడగలవు. అప్పుడు ఇండియాగాని, ఆఫ్రికాగాని ఏమీచేయజాలవు; ఈఐక్యరాజ్యపరిషత్తుకుగూడా ఒకపట్టాన పరిష్కరించలేని విషమ సమస్యలే ఉత్పన్నము లౌతాయి. భారతీయుల ఫిర్యాదును ఉపేక్ష చేసినట్టయితే సంయుక్త రాజ్యాలవారి ఛార్టరును (United Nation's-Charter) అనాదరించినట్టే. అదీగాక యాభైనాలుగు రాజ్యాల ప్రతినిధులక్కడసమావేశమై ఈసమస్యనున్యాయంగా పరిష్కరించలేక పోయినారంటే—భారతీయులను హింసించమని మీరందరూ దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి మద్దతుగా నిల్చారన్నమాట!"

అట్టి ఉరుములవంటి పలుకులతో విజయలక్ష్మి రష్యా, ఈజిప్టు, పోలెండు మొదలైనదేశాల సానుభూతి సంపాదించుకోగలిగింది.

స్మట్సు మాత్రం తనపట్టువీడలేదు. దక్షిణాఫ్రికాలోని భారతీయుల సంరక్షణ నిమిత్తమే తానా చట్టాలు జారీ చేశానన్నాడు. వివిధ మతాలవారు ఒకేచోట ఉంటే పరస్పరకలహాలు రేగుతూ ఉంటాయి గనుక వారిని విడివిడిగా ఉంచటానికి ప్రయత్నంచేస్తున్నానన్నాడు. తాడిచెట్టెందు కెక్కావంటే దూడమేత కన్నట్టుగా అసందర్భపు సమాధానాలు, డొంకతిరుగుడు సమర్థనలు చెప్పుకున్నాడు.

స్మట్సు ఇంకొక ఎత్తుకూడా వేశాడు: ఈ ఇండియా—దక్షిణాఫ్రికా తాగాయిదాను అంతర్జాతీయ న్యాయస్థానం వారి తీర్పుకు విడిచిపెట్టవలసినదిగా ఐక్యరాజ్యపరిషత్తు కమిటీని కోరినాడు. అంతర్జాతీయ న్యాయస్థానంవారు ఒక కమిటీని దక్షిణాఫ్రికాకు పంపించి, యథార్థపరిస్థితులను తెలుసుకుని ఒకన్యాయమైన తీర్పుఇస్తే దానికిబద్ధుడ నౌతానన్నాడు.

అది అనవసరంగా కాలయాపన చేయటానికి స్మట్సు పన్నిన పన్నాగం అనీ—ఈ సమస్యను పరిష్కరించగల అధికారం ఐక్యరాజ్య పరిషత్తుకు లేనట్టుగా స్మట్సు సూచించటం అసంబద్ధంగా ఉన్నదనీ—అంతర్జాతీయ న్యాయస్థానం వారి తీర్పు రూపొందటానికి కొన్ని సంవత్సరాలు జరగిపోవలసి వుంటుంది గనుక ఈలోగా పరిస్థితులు శృతి మించి రాగాన పడగలవనీ—భారత ప్రతినిధి వర్గంవారు చెప్పారు. సబబుగానే ఉంది. స్మట్సు ప్రతిపాదనము వీగిపోయింది.

మూడింట రెండు అగ్రరాజ్యాలు (బ్రిటన్ అమెరికాలు) స్మట్సుకే అండగా నిల్చాయి. బ్రిటిష్ కామన్వెల్త్‌లోని భారతీయులకు దక్షిణాఫ్రికాలో అన్యాయం జరుగుతోంటే

బ్రిటన్ ఏ పక్షమూ వహించకండా ప్రతిష్ఠ కాపాడు కుంటుందని విజయలక్ష్మి ఆశించింది. కాని అలా జరుగ లేదు. నీగ్రోలపై తమ ఆధిక్యత చెక్కు చెదరకండా ఉంచు గలందులకై కామాలు అమెరికా కూడా స్మట్సుకు మద్దతు ఇచ్చింది. 'నల్ల జాతుల వారిని అల్పదృష్టిలో చూడ్డం క్రీస్తు మత సిద్ధాంతాలకే విరుద్ధం' అని ఊాయీాఫిషర్ సూక్తి. అయినా ఆ క్రిష్టియన్ దేశాలే 'మాలపల్లి' బిల్లు సంచాలకు నికి బాసటయై నిల్చాయి. అందుచేతనే ప్రప్రథమంలో 'దక్షిణాఫ్రికా భారతీయుల సమస్య మా దేశ ఆంతరంగిక విషయం. ఇతర్లు జోక్యం కలుగజేసుకోవలసిన పనిలేదు' అంటూ స్మట్సు హుంకరించగలిగాడు.

కాని పాపం అతనికి ఐక్యరాజ్య పరిషత్తులో బాగానే మొట్టికాయలు తగిలాయి. దక్షిణాఫ్రికా ప్రభుత్వపు మాండే టరీ రాజ్యంగా ఉంటోన్న నైరుతి ఆఫ్రికాను దక్షిణాఫ్రికా య్యూనియన్‌లో చేర్చుకునేందుకు అనుమతించవలసినదిగా స్మట్సు ఐక్యరాజ్య పరిషత్తు ధర్మకర్తృత్వ ఉపసంఘానికి అర్జీ దాఖలు చేసుకోవటంతో ఆ ప్రబుద్ధుని సామ్రాజ్య వాద దౌష్ట్యం పండి బ్రద్దలైంది.

చివరకు ఐక్యరాజ్య పరిషత్తు రాజకీయ—న్యాయ (Poli tical and Legal) కమిటీలు రెండున్నూ....విజయలక్ష్మి ప్రభృతులు దక్షిణాఫ్రికా ప్రభుత్వంపై తెలిపిన యాక్షేప ణలను ఒప్పుకోవటమైంది. ఇండియా దక్షిణాఫ్రికా ప్రభు త్వాలు రెండున్నూ ఒక సంతృప్తికరమైన ఒడంబడికకు రావలసినదిగా తీర్మానించటమైంది. ప్రపంచ న్యాయాల

యంలో విచారణ జరుగవలెనన్న స్మట్సుగారి ప్రతిపాదనము వీగిపోయినది. 'మాలపల్లి' బిల్లు అమలు చేయటం ద్వారా అంతర్జాతీయ సంబంధ మర్యాదలను అతిక్రమించిన దని దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి మందలింపులు తగిలినవి. దీనితో స్మట్సు మళ్ళీ ఒకసారి తన పూర్వపు చర్యలన్నీ సరిదిద్దు కోవలసి ఉంది. మాలపల్లి చట్టాన్ని ఉపసంహరించుకుని, ఇరుదేశాల ప్రతినిధులు కలిసి భవిష్యద్విధానం చర్చించుకు నేందుకు ఒక రౌండ్ టేబిల్ సమావేశం జరుపవలసి ఉంటుంది. ముందు ఏమైనా జరుగనీ—దక్షిణాఫ్రికాలో భారతీయులకు న్యాయం జరిగేట్లు చూడవలసిన బాధ్యత భారత ప్రభుత్వానికి కలదనీ—స్మట్సు తన యిష్టం వచ్చినట్లు వ్యవహరించేందుకు వీల్లేదనీ—రుజువై పోయింది. విజయలక్ష్మికి అఖండమైన విజయం లభించింది.

స్మట్సు కడుపుఉబ్బరం పట్టలేక పోయాడు కామాలు— "ఇంకేం, నీకు తృప్తి అయిందా?" అని ప్రశ్నించాడామెను బైటికివచ్చాక.

నిజానికి విజయలక్ష్మి విజయం ప్రపంచంలోని రంగుజాతు లందరిదీని. తెల్లవారి జాత్యహంకారానికి తుదిచీటి ఈ విజయం.

విజయవిభూషితయై విజయలక్ష్మి డిశంబరు 15 తేదిని కరాచీలో విమానందిగింది. ఆమెధరించిన, తళతళలాడు తోన్న నీలిరంగుచీర మెరుపులలో నల్లజాతుల విజయవిలాస రేఖలు చిందులాడినవి. కరాచీమేయర్ ఆమెకు స్వాగత మిచ్చాడు.

# పుష్పాంజలి

"ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించి, నన్"—అను కవిసూక్తికి శ్రీవిజయలక్ష్మి జీవిత చరిత్ర ఒక చక్కని ఉదాహరణము.

విజయలక్ష్మి విజ్ఞానఖని యనిపించుకున్నది. పేరు ప్రతిష్ఠల నార్జించింది. ఖండాంతరాలలో తన విజయ పతాకం ప్రతిష్ఠించుకున్నది. భారత స్వాతంత్ర్య యోధినుల చరిత్రలో ప్రథమ ప్రకరణ మామెదే. భావిభారత మహిళాభ్యుదయాని కామె ధృవతార. తుప్పు పట్టిపోయిన ప్రాతసాంప్రదాయాలలో క్రుంగుతూన్న యువతులలో ఆమె నూతన జాగృతిని తెచ్చింది. భారత మహిళల కామె ఆదర్శజిజ్ఞాసువు ఐనది.

ఉదారాశయాలు గలిగి, విశాల హృదయుడైన తండ్రి మోతీలాలు ప్రాభవాన ఆమె చిన్నతన మందే వ్యక్తి వికాసానికి దోహదములు కాగల విజ్ఞాన బీజాలను సంతరించు కున్నది.

భారత స్వాతంత్ర్య చరిత్రలో ప్రముఖ పాత్ర నిర్వహించిన నెహ్రూ వంశంలో జన్మించిన కారణాన ఆమె రాజకీయ చతురత ప్రత్యేకంగా అభ్యసించవలసిన అవసరం లేకపోయింది. రాజకీయ విజ్ఞాన మామెకు ఉగ్గుపాలతో వచ్చిన విద్య.

ఇకపోతే బహు భాషాకోవిదుడు, కల్హణుడను బౌద్ధ విజ్ఞానమూర్తి సంస్కృతంలో రచించిన 'తరంగిణి' యను గ్రంథాన్ని ఇంగ్లీషు భాషలోనికి అనువదించిన ప్రతిభాశాలి

శ్రీరణజిత్ పండితుని చేపట్టిన తరువాత విజ్ఞానమే ఆమెను వరించిన దైనది.

నెహ్రూ కుటుంబంతో శ్రీమతి సరోజినీ నాయుడుకు చాల కాలంనుంచీ పరిచయం ఉంది. ఆమె మోతీలాలు భార్య స్వరూపరాణిని 'మమ్మాజీ' అని పిల్చేది. విజయలక్ష్మి చెల్లెలు కృష్ణను ముద్దుగా 'బెట్టీ' అని పిల్చేది. విజయలక్ష్మికి, కృష్ణకూ ఆమె అక్కయ్యలా వ్యవహరించేది. భారత రాజకీయాల్లో ప్రముఖ స్థానం ఆక్రమించిన ఈ విదుషీమణి ప్రభావంకూడా కొంతవరకు విజయలక్ష్మి మనోవికాసానికి తోడు పడి యుండవచ్చు.

ఇంకా అనేకమంది ప్రముఖ రాజకీయ వ్యక్తులు తరచు మోతీలాల్‌తోను, జవహర్‌తోను సంప్రదింపుల కోసం ఆనంద భవనానికి వస్తూ పోతూ ఉండేవారు. అట్టి వారందరితోనూ విజయలక్ష్మికి చిన్నపుడే పరిచయ భాగ్యం లభించింది. కాగా తానుకూడా క్రమేణా రాజకీయాల్లో ప్రవేశించి పేరెన్నిక గన్నది.

అదీగాక తండ్రి మోతీలాల్ అసెంబ్లీలో ప్రతిపక్షనాయకుడుగా ఉంటూన్నపుడు బాలిక విజయలక్ష్మి అనేకసార్లుఅసెంబ్లీ గ్యాలరీలో కూచుని ఆ చర్చలు ఆకళింపు చేసుకుంటూఉండేది. చివరకామె సంయుక్త రాష్ట్ర శాసన సభామంత్రిణి యైనపుడు తన బాధ్యతలు సులభంగా గ్రహించగలిగినది.

ఇలాగ బహుశ్రుతులతోడి సహవాసము ఆమె కెంతైనా ఉపకరించింది. అంతేకాదు; బహు దేశాటనము కూడా ఆమెకెంతో విజ్ఞానాన్ని, అనుభవాన్ని చేకూర్చినది.

నెహ్రూ కుటుంబంలోని వారికి యూరప్ వెళ్ళి రావట మంటే షికారు వెళ్ళిరావటంలా ఉంటుంది. జవహర్‌లాల్ నెహ్రూ విద్యాభ్యాసమంతా ఇంగ్లండులోనే. విజయలక్ష్మి కూడా చాల పర్యాయాలు యూరప్ సంచారంచేసి వచ్చింది. పశ్చిమీయ నాగరకతా విజ్ఞానాల నించి భారత దేశం నేర్చు కోవలసిన కొన్ని అంశాలు లేకపోలేదు. విజయలక్ష్మిలో ప్రాక్పశ్చిమ విజ్ఞానాల సమన్వయస్థితి మనకు కనిపిస్తుంది.

1938 లో సంయుక్తరాష్ట్ర మంత్రిణిగా ఉంటూ విజయ లక్ష్మి ఇంగ్లండు వెళ్ళింది. అప్పుడక్కడ కొన్ని వినోద సంఘ టనలు జరిగాయి. ఈ క్రింద ఉదహరిస్తున్నాం.

ఒక్క సంవత్సరం పాటు మంత్రిత్వ బాధ్యతలు నిర్వ హించే సరికి విజయలక్ష్మికి ఆరోగ్యం కొంచెం చెడింది. రాష్ట్రమంతా కలరా - ప్లేగు జాడ్యాలు విరివిగా వ్యాపించి యున్న రోజులవి. విజయలక్ష్మి ఆరోగ్య శాఖా మంత్రిణి కదా! పల్లెపల్లెలకు సంచారంచేసి ప్రజా రోగ్య రక్షణకు సౌకర్యాలు ఏర్పాటుచేసిందామె. అలా విశ్రాంతి లేని కార్యనిమగ్నతవల్ల ఆమె బాగా అలసి పోయింది. ఆరోగ్యం కోసం ఆమె కొన్నాళ్ళు హిమాలయ పర్వత ప్రాంతంలో ఉన్న ముసోరీలో కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకుందిపోయి. కాని అందువల్ల ఎక్కువ లాభము లేకపోయింది. మిత్రుల సలహా ననుసరించి ఆమె విశ్రాంతి కోసం 1938 ఆగస్టు అఖరు వారంలో బయలుదేరి ఇంగ్లాండు వెళ్ళింది. ఆ సమ యంలో ఆమె సోదరుడు జవహర్ పండితుడుకూడా యూరప్ లో సంచారంచేస్తూ ఉన్నాడు.

గొప్ప ప్రజాస్వామిక దేశమని ప్రసిద్ధి గన్న ఇంగ్లాండు చరిత్రలో అంతవరకు ఒకే ఒక మహిళ మంత్రి పదవి నధిష్ఠించినది. నాలుగుకోట్ల యాభై లక్షలు జనసంఖ్య గల సంయుక్తరాష్ట్రపు మంత్రిణి విజయలక్ష్మి ఇంగ్లాండు వచ్చిందనే సరికి పత్రికా రచయితలు ఆమె చుట్టూ మూగినారు. విశ్రాంతి కోసమని ఆమె వస్తే పత్రికల వాళ్ళు ఆమెకు విశ్రాంతి ఇవ్వనే లేదు.

కాకతి రుద్రమ్మ గణపతి దేవుని భార్య యని మార్కోపోలో వ్రాసినట్టు ఇంగ్లాండు జర్నలిస్టులు విజయలక్ష్మిని గురించి అనేక విపరీతపు పలుకులు వ్రాసినారు. ఆమె జవహార్ పండితుని కూతురని కొందరు, భార్య యని కొందరు వ్రాశారు. ఆమె యెన్ని చీరలు తెచ్చుకుందో తెలుసు కోవాలని కొందరు తాపత్రయ పడ్డారు. ఆమె ఆరోగ్యం కోసం రోజూ శీర్షాసనం వేస్తుందనీ, వారానికి నాలుగురోజులు ఉపవసిస్తుందనీ విస్తారంగా చెప్పుకునేవాళ్ళు. హిందూసాంప్రదాయాను గుణ్యంగా ఆమె ముఖాన కుంకుమ బొట్టుపెట్టు కుంటే.... మాతృదేశం కోసం భారత మహిళలు తమ రక్తాన్ని అయినా ధారపోయ గలరని సూచించే నిమిత్తం ఆమె తిలకం పెట్టుకుంటుందని కొందరు ప్రచారం చేశారు. ఆంగ్లేయుల ఈ అపోహలన్నింటినీ తొలగించవలసిన బాధ్యత ఒకటి ఆమెపై బడ్డది.

"మీకు వివాహమై ఎన్నాళ్ళయింది?" అని ఒక పత్రికా విలేఖరి కుతూహలుడై ప్రశ్నించాడు.

విజయలక్ష్మికి కోపం కూడా వచ్చింది. "ఏమో ఎన్నాళ్ళయిందో, నాకు తెలియదు నాకిప్పుడు ఒక మేజరైన కూతురు కూడా ఉంది" అని చెప్పింది.

విజయలక్ష్మి ఇంగ్లాండులో ఉన్నప్పుడే జెకోస్లోవికియా సమస్య తీవ్రరూపం దాల్చింది. జెకోస్లోవికియాను కబళింప జూస్తోన్న జర్మనీకి ఇంగ్లండు అడ్డు చెప్పలేదు. సుడేటన్ జర్మన్ల విషయంలో స్వయం నిర్ణయ సూత్రాన్ని ఒప్పుకున్న బ్రిటిష్ ప్రధాన మంత్రి భారతీయుల విషయంలో ఆ సూత్రాన్ని ఎందుకు అమల్లోకి తీసుకురాడని విజయలక్ష్మి నిలువ దీసి అడిగింది. భారత దేశంలోని ఒకానొక రాష్ట్రపు మంత్రిణి బ్రిటిష్ ప్రధానినే ఇలా ధైర్యంగా ప్రశ్నించటము చ్చాలమందికి ఆశ్చర్యమైంది.

ఇంగ్లండులో ఆమె కొద్ది రోజులుమాత్రమే ఆసుపత్రిలో ఉంది. ఆ తరువాత విరివిగా ఉపన్యాసాలిచ్చింది. చివరకు ఆమ్‌స్టర్‌డామ్ మీదుగా విమానంలో వచ్చి మళ్ళీ మంత్రి పదవి స్వీకరించింది.

ఆ రోజుల్లో 'ఆప్ బీతీ' అను హిందీ పత్రికలో డాక్టర్ దత్ విద్యాలంకార్....జవహర్ పండితుడు మ్యూనిచ్‌కి వెళ్ళటంగురించి అపార్థం కల్పించి వ్రాశాడు. జవహర్ నాజీ పక్షపాతి యన్నట్లుగా సూచించి మ్యూనిచ్‌లో ఆతడు గోబెల్సును కలుసుకొని వచ్చాడని అబద్ధాలు వ్రాశాడు. విజయలక్ష్మి అతని వ్యాసాన్ని తీవ్రంగా విమర్శించింది. జవహర్ మ్యూనిచ్ వెళ్ళి వచ్చాక వారం రోజులకు విజయలక్ష్మి కలుసుకుంది. జవహరును మ్యూనిచ్‌లో సందర్శించి

నది ఒక స్థానిక పత్రికా విలేఖరి; అంతేగాని గోబెల్స్ కాదు. ఆ పత్రికా విలేఖరి గోబెల్స్ అని అనుకొని అబద్ధాలు రాయటం తప్పనీ—తనసోదరుడు మొదటినుంచీ నాజీతత్వ విరోధి యనీ—చెబుతూ విజయలక్ష్మి విద్యాలంకార్ వ్యాసాన్ని ఖండిస్తూ పత్రికా ప్రకటన చేసింది.

ఇంతకూ చెప్ప వచ్చిందేమంటే — పరిస్థితులూ, అవకాశాలూ అలా కూడివచ్చి విజయలక్ష్మిని అంత జగద్విఖ్యాత వ్యక్తినిగా తయారు చేసినవి.

అట్లని ఆమెలో స్వయంప్రతిభా విశేషాలు లేవని భావించటం పొరపాటు. అకుంఠిత దేశభక్తి, మొక్కవోని ధీపటిమ, పారమెరుగని ధైర్య సాహసాలు ఉన్నవి గనుకనే లభించిన అవకాశాలను అంది పుచ్చుకొని కీర్తిప్రధాన పురోగామి కాగలిగినది; రాజకీయ బాధ్యతలు సక్రమంగా నిర్వహించ గలిగినది; స్త్రీలుకూడ పురుషులతో పాటు దేశ స్వాతంత్ర్య సమరంలో కత్తులు ఝుళిపించ గలరు. ఎంత బరువైన బాధ్యతలుకూడా నిర్వహించ గలరు—అని రుజువుచేసి చూపించింది.

ఒకసారి విజయలక్ష్మి ఒక గొప్పయింటి యిల్లాలుతో మాటాడుతూ దేశక్షేమంకరమైన కార్యక్రమాలలోకూడా పాల్గొన వలసినదిగా ప్రసంగ వశాత్తు సలహా చెప్పింది. ఆ సలహా ఆ యిల్లాలికి నచ్చలేదు. ఆమెకు అట్టి సలహా యిచ్చినందుకు కోపం కూడావచ్చింది.

“నేను నాయిల్లు, వాకిలి విడిచివెళ్ళి రాజకీయాల్లో ఎందుకు మునిగిపోవాలి? నా భర్తను, బిడ్డలను సేవించటం

నా ధర్మం, కాదా? దేశస్వాతంత్ర్యమంటూ పరుగులు పెట్టవలసిన అవసరం నా కేముందీ?" అన్నదా యిల్లాలు.

"నేను చెప్పినట్టు నడుచుకుంటే మీరు ప్రజాసేవ చేయ గలుగు తారు; అంతేగాక కొంత వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కూడా మీరు చవి చూడ గలుగుతారు" అన్నది విజయలక్ష్మి.

ఆ యిల్లాలకి ఇంకా కోపం వచ్చింది. అన్నది—"ఒక గౌరవనీయురాలకి కావలసినంత వ్యక్తి స్వాతంత్ర్యం నాకిప్పుడు లేకపోలేదు. ఇల్లూ - వాకిలి విడిచేసి వచ్చిన మీవంటి వారు అర్థం లేకండా 'స్త్రీ స్వాతంత్ర్యం' అంటూ వాగుతూంటారు."

ఆ తరువాత విజయలక్ష్మి ఆమెకు నచ్చ జెప్పటానికి ప్రయత్నించింది, కాని లాభం లేకపోయింది.

భర్తృ వాల్లభ్యాన్ని, బిడ్డల క్షేమాన్నీ వాంఛించి అందు కోసం స్త్రీలు శ్రమించవలసినదే. అందులో తప్పే మీ లేదు. కుటుంబ క్షేమం కోసం ఓపికతో ఎన్ని యిబ్బందులైనా ఎదుర్కొ-గల సహన శక్తి వారికి ఆ జన్మసిద్ధము కాని —

—పరాయి బిడ్డలు కూడా తన బిడ్డలే నన్న భావము, సంఘం కోసం, దేశం కోసం కూడా తాను కృషి చేయవలసిన బాధ్యత—స్త్రీ గుర్తించటం అవసరం. తన కుటుంబాన్ని ప్రేమించటంతో ఆరంభమైన స్త్రీ జీవితం క్రమేణా దేశ సేవలో, సంఘసేవలో పునీతము గావలసి యున్నది. వంట యింటి కుందేలు వలె, కూపస్థ మండూకము వలె ఆడుది తన బ్రతుకుని వ్యర్థము, నిరానందము చేసుకొన రాదని విజయలక్ష్మి యాశయము.

మరీ ఉన్నతా దర్శపూరితలైన కొందరు స్త్రీలు తమ క్షేమం, తమ బిడ్డల సౌకర్యాలు కూడా చూచుకోకండా సదా సంఘ శ్రేయం కోసమే జీవితాన్ని ధార పోస్తారు. అందరూ అంత నిస్వార్ధంగా ప్రవర్తించలేరు. కాని అట్టివారు అభినందనీయులు, వారి కార్యకలాపము తమ తరువాత వారికి సౌఖ్యప్రదము లౌతాయి. వారిని దేశం మరచి పోలేదు. విజయలక్ష్మి కూడా అట్టి మహోజ్వల మూర్తులలో చేర్చ దగిన వ్యక్తి.

ఆమె తన సంతానంకన్నా దేశాన్నే అధికంగా ప్రేమిం చింది. తాను మాటిమాటికీ స్వాతంత్ర్య సమరంలో కోక బిగించి దూకేది. జైలుకు వెళ్ళేది. ఈడురాని పిల్లలు ఇంటి వద్ద తల్లి కోసం బెంగ పెట్టుకుని, ఇతర్ల పోషణలో ఉంటూ ఎలా కాలక్షేపంచేసేవారో భగవంతునికి తెలియాలి.

అట్టి సమయాల్లో విజయలక్ష్మి మాతృహృదయం పంజ రంలో పిట్టలా కొట్టుకులాడేది. అయినా ఆమెకు దేశం తరు వాతే పిల్లలు.

అంత నిస్వార్ధం మళ్ళి ఆమె చెల్లెలు కృష్ణ ప్రదర్శించ లేకపోయింది చూడండి. అస్తమానం రాజకీయాల్లో నిమగ్నులై ఉండేవారు జవహర్ పండితుడు, విజయలక్ష్మి. వారి పిల్లలు సరియైన పోషణ లేకండా ఉండేవాళ్ళు. అది కళ్ళారా చూస్తూండేది కృష్ణ. అందుచేత ఆమె తన బిడ్డలకు ఏ విధమైన కొదువ కనబడ నీయకండా ఉండగలందులకు తాను రాజకీయాల్లో ఎక్కువ పాలు తీసుకోవటం మాని

వేసింది. అని ఆమే 'With No Regrets' అను గ్రంథంలో స్వయంగా రాసింది.

ఏమైనా కానీ విజయలక్ష్మి జీవితం నించి భారత మహిళలు నేర్చుకోవలసిన దేమంటే—పాత కుళ్ళుతో మనకిక ప్రయోజనం లేదు. 'యావజ్జీవమూ స్త్రీ మరొకని యధీనం లోనే ఉండాలి; ఆమెకు స్వాతంత్ర్యం లేదు' అంటూ శాసించిన మనుధర్మ సిద్ధాంతాలు ఒకానొక కాలంలో సమంజసములుగా ఉండవచ్చును. హైందవ సాంప్రదాయాలు, ఆచారాలు ఆదినించీ కాలానుసరణంగా మారుతూనే వచ్చాయి. ప్రస్తుత కాలానికి అనువైన, అవసరమైన మార్పులకు మనం వెరువరాదు. ఎంతమంచి సాంప్రదాయమైనా కొన్నాళ్ళకది తప్పుకుని కొత్తదానికి చోటివ్వాలి. నూతన పరిస్థితులకు సరిపడని, అభివృద్ధి నిరోధకాలైన పాత ఆచారాలు సంఘాన్ని పాడుచేసి తీరుతాయి. బ్రౌనింగు కవి చెప్పినట్టు (Love is woman's whole existence)'ఆడు దాని జీవితమంతా ప్రేమమయం'. కాని భర్తనూ, బిడ్డలనూ ప్రేమించటము మాత్రమే కాదు ఆధునిక యువతికిఆశయము. తన జీవితాన్ని కూడా ఆమె ప్రేమించవలసి ఉన్నది. ఆమె ప్రపంచాన్ని చూడాలి, అర్థం చేసుకోవాలి, అన్ని అనుభవాలనూ చవిచూడాలి, సుఖాలు-అన్నీ అనుభవించాలి-ఇన్నాళ్ళనించీ ఒక సంకుచితమైన వాతావరణంలో పెరుగుతూ వచ్చింది స్త్రీ. అందుచేత ఆమె శారీరకమానసిక వికాసం పరిపూర్ణము కాలేదు. ఆమె స్వేచ్ఛావాయువులు పీల్చటం అలవాటు చేసుకోవాలి. సంఘాన్నీ, దేశాన్నీ బాగు

చేసుకుంటూ తన యింటిని చక్కబెట్టుకోవాలి. పురుషునికి తానేమి ఎందునా తీసిపోనన్న ఆత్మ విశ్వాసాన్ని కలిగి వుండాలి.

"స్త్రీ పురుషులు సమాన భాగస్వాములుగా ఉన్న నాగరకతే నాగరకత. స్త్రీ పురుషుల సంయుక్త కృషితో నిర్మితమైనదే జాతి. స్త్రీ పురుషులు కలిసి పనిచేసి, అభ్యుదయ కార్యక్రమం నిర్వహించినప్పుడే నిజమైన ఐక్యత. స్త్రీ పురుషులు కలిసి స్వాతంత్ర్య సమరంలో పాల్గొని యుద్ధం చేసినప్పుడే స్వాతంత్ర్యం"—ఇవి విజయలక్ష్మి పలుకులు.

ఆ పలుకులు స్త్రీలంతా సర్వదా జ్ఞాపకముంచుకుని ముందుకు రావాలి. స్త్రీలను పరదా వెనుక అసూర్యం పశ్యలనుగా, ఇంటి బానిసలనుగా మాత్రమే ఉంచవలెనని మంకుపట్టుతో ఉండే స్వార్థపరులైన పురుషులు తమ కన్సర్వేటివ్ అభిప్రాయాలను మార్చుకుని స్త్రీలకు సర్వావకాశాలను కల్పించి వారి వ్యక్తివికాసానికి అనుమతిస్తారుగాక! శ్రీమతి సరోజినీ దేవిని, విజయలక్ష్మిని ఆదర్శమూర్తులనుగా పరిగణించి భారతస్త్రీలుకూడా ముమ్మందు రష్యన్ స్త్రీలవలె ముందడుగువేసి దేశసౌభాగ్యానికి కృషి చేస్తారుగాక!

ధైర్యసాహసాలకు, దేశభక్తికి రష్యన్‌స్త్రీలది పెట్టినపేరు. గత మహాసంగ్రామంలో రష్యా యువతులు ప్రదర్శించిన సాహసకృత్యాలు పురుషులనుకూడ ఆశ్చర్య పెట్టినవి. 'ఎవడోకి నోసాల్' అనునామె వైమానిక దళంలో జూనియర్ లెఫ్టినెంటుగా పనిచేసింది. 'వెలేరీనా రోవస్కీ' అనునామె యుద్ధంలో ఒకానొక సంగర్భంలో మూడువందలమంది

గాయపడిన - సైనికులను రక్షించింది. ఇంకా అనేకమంది యువతులు కర్మాగారాలలో పనిచేసి అధికంగా ఆయుధోత్పత్తిని చేసి యుద్ధకృషికి ఎంతైనా తోడ్పడ్డారు.

రష్యాలోని ఆర్థిక రాజకీయ సాంఘిక క్షేత్రాలలో స్త్రీలు పురుషులతోపాటు సమాన హక్కులు అనుభవిస్తున్నారు. స్త్రీలకుకూడా ఉద్యోగా లిస్తామని ప్రభుత్వం గ్యారంటీ చేస్తున్నది; విద్యాసౌకర్యా లున్నాయి; ముసలితనంలోను, సుస్తీ చేసినప్పుడూ పెన్షన్‌లు ఉన్నాయి. భారత దేశంలోకూడా అలాగే పురుషులతోపాటు స్త్రీలుకూడా అన్ని హక్కులూ అనుభవించగల—ఆత్మవికాసానికి పర్యావకాశములూగల—ఒక నూతన సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి స్త్రీలంతా కలిసిపనిచేయవలెనని విజయలక్ష్మి సందేశం.

"విజయలక్ష్మివంటి నాయకురాండ్రక్రింద తర్ఫీదుపొంది భారత నారీమణులు ఉన్నతాశయాలు అలవరచుకుని దేశాన్ని రక్షించుకోగలరు. హింసాత్మకంగానో,అహింసాత్మకంగానో పురుషులతోపాటు సరిసమానంగా స్వాతంత్ర్య సమరంలో యుద్ధంచేసి స్వరాజ్యాన్ని ఆర్జించుకోగలరు; ఆర్జించిన స్వరాజ్యాన్ని నిలుపుకోగలరు. స్త్రీఅభ్యుదయానికి ఆటంకములైన సాంఘిక—మతనిబంధనలను విజయలక్ష్మి పూర్తిగా గర్హిస్తుంది. కేవలము పశ్చిమీయ నాగరకతా సాంప్రదాయాలను అనుకరించటం కూడా ఆమెకిష్టంలేదు."

ఈనాటికి భారతదేశంగతి ఇలాపట్టిందిగాని—భారత నాగరకతా సంస్కృతులు అనాదివి; విశిష్టములు. వీరపుంగవులను, మహాపురుషులను, ప్రవక్తలను ప్రసవించిన దేశమిది.

కనుక మన స్వసంస్కృతిని విస్మరించి పరాయి విజ్ఞానాలను ఆశ్రయించవలసినంత దుర్గతి పట్టలేదింకా.

ఎట్టి పునర్నిర్మాణము చేసుకోవలెనన్నా మన విజ్ఞాన సంస్కృతులకు అనుగుణ్యంగా చేసుకోవాలి. స్వతంత్ర ఆలోచనలు నశించి, భావదాస్యానికిలోనై మనలో చాలమంది పాశ్చాత్యజీవన పద్ధతులను అవలంబించుట ఆమెకునచ్చదు.

భారత దేశంలో పాశ్చాత్య నాగరకతను తెచ్చి నాటటం ఆమె కిష్టంలేదు.

"మనకు కావలసినంత విజ్ఞానం ఉంది. ఒక మహోత్కృష్టమైన నాగరకత పెంపొందిన దేశం మనది. పశ్చిమీయ నాగరకతనించి మన కవసరమైనంతవరకు మంచిని స్వీకరించి మన విజ్ఞానంలో కలుపుకొని సంఘపునర్నిర్మాణం చేసుకోవలె" అంటుంది విజయలక్ష్మి.

అంతేగాని భారతీయులు పూర్తిగా ఐరోపీయులుగా మారిపోవటం విజయలక్ష్మికి ఇష్టంలేదు.

భావిభారత పునర్నిర్మాణానికి ప్రాచీన భారత సంస్కృతి ప్రాతి పదికగా ఉండాలి. అయితే కాలక్రమాన భారత సంఘంలో వచ్చి కలసిన కుళ్ళును క్షాళనం చేయాలి. పశ్చిమీయ నాగరకతలోని మంచిని కూడా మనం గ్రహించాలి—అదీ భారత పునర్నిర్మాణం విషయమై విజయలక్ష్మి ఉద్దేశం.

అస్పృశ్యత, కుల విభేదాలు, మూఢాచారాలు మొదలైన వన్నీ నశించి భారత దేశం మళ్ళీ తన పూర్వపు ఔన్నత్యాన్ని చుంబించవలెనని ఆమె ఆశయం.

అందుకనే ఆమె నిత్యమూ కృషి చేస్తున్నది; తన జీవిత మంతా దేశ సేవకే అంకితం చేసింది. ఆమెకు భారతీయులు కలకాలము కృతజ్ఞులై ఉంటారు.

1945లో విజయలక్ష్మి భర్త రంజిత్ పండిట్ మరణిం చాడు. ఆ నష్టమామె ఎట్లు భరించినదో ఆమెకే తెలియాలి. ఆదుఃఖముతో ఆమె క్రుంగి పోకండా—అధికోత్సాహముతో ఆమె దేశసేవ చేయగలుగుటకు తగినంత సహనశక్తి, దార్ఢ్యము ఆమెకు ప్రసాదించినందుకు భగవంతునికి ధన్య వాదము.

భార్యపోయి జవహర్ పండితుడు భారత వీరపురుషుల కందరకూ నాయకుడై అనిమిష రాజకార్య నిమగ్నుడై నాడు. భర్తపోయి విజయలక్ష్మి భారత వీరమహిళాలోకానికి పట్టముగట్టుకుని స్వాతంత్ర్య పథాన మనల్ని ముందుకు తోడుకుని పోవుచున్నది. ఆమె వెయ్యేళ్ళు బ్రతకవలె.

భారతస్వాతంత్ర్య సమరాంగణంలో నిష్కామయోగిని
గాంధీజీ సత్యాగ్రహ సైన్యంలో వీరయోధిని,
మా విజయలక్ష్మికివే
మా పుష్పాంజలులు!

Unity Printers, Tenali G. 96. 3-47.
Modern News Agency, Bezwada. K. 66. C. 1000.